# విజయ-విక్రములు

రచయిత:

మానెం లింగరాజు



ప్రకాశకులు:

రాష్ట్రేతరాంధ్రజ్యోతి సాహితీ సమితి,

టిటాఘర్.

# రాష్ట్రేతరాంధ్రజ్యోతి సాహితీ సమితి

## టిటాఘర్

యిందు పోషకులుగా చేరువారు 5 రూపాయలు చెల్లించవలసి యుండును. అట్టివారి నామములు సమితి ఆధ్వర్యాన వెలువడు పుస్తకమునందు ప్రచురింప బడుటయేగాక ముద్రితమగు ప్రతీ గ్రంథము వుచితముగా సమర్పింపబడును.

ఇట్లు విన్నవించు విధేయులు.

ఎల్లేటి క్రిష్ణారావు,
మానెం లింగరాజు,
తోటా విశ్వనాథం.

రాష్ట్రేతరాంధ్రజ్యోతి సాహితీసమితి ప్రథమ కుసుమము.

# విజయ - విక్రములు

## (జానపద గాథ)

[హిందీ కథకు ఆధారం]

రచన :

శ్రీకాకుళం జిల్లా, దూసిపేట గ్రామ వాస్తవ్యులగు
మానెం గోదావరి, లింగమ్మగార్ల ఏకైకపుత్రుడు

మానెం లింగరాజు



ప్రకాశకులు :

రాష్ట్రేతరాంధ్రజ్యోతి సాహితీ సమితి,
టిటాఘర్.
(24 పరగణాలు)

**1953**

మూల్యం 6 అణాలు.

# అంకితము

ఐదవ యేట అక్షరాభ్యాసము చేయించి, ఐదవ తరగతి వరకు చదువుజెప్పి, నాపై గల వాత్సల్యంతో న న్నున్నతవిద్య నభ్యసింప జేయుటకై స్వగ్రామమున కంపి, నేను తిరిగి వచ్చినప్పుడు- తాను వృద్ధాప్య దశ నొందుటచే తనకు బదులుగా నన్ను తన పీఠాన్నలంకరింపజేయించి, న న్నొక వుపాధ్యాయునిగా తయారుజేసిన మద్గురు వరేణ్యులగు యం. రాఘవయ్య పంతులు గారికి భక్తి పురస్సరంగా.

—రచయిత.

# తొలిపలుకు

మా యీ ప్రాంతములందు సంఘ, సామాజికములు సురక్షితంగా నడుపబడుచున్న సమయమందు శ్రీమాన్ యిమ్మానుయేలు మాస్టరుగారు "ఆంధ్ర యువజన చర్చా సమ్మేళనము" అను నొక సంస్థను స్థాపించి, అందు నన్ను కార్యదర్శిగా నియమించి, రచనలలో ప్రథమమున నన్ను తర్ఫీదు గావించిరి. టిటాఘర్ ఆంధ్ర సంఘ ప్రధానాధ్యక్షులు అగు శ్రీ వాకపల్లి సూర్యనారాయణ నాయుడుగారుకూడా నన్నూ, నా రచనలనూ ఒడుదుడుకులు గానీకుండా నిలుచునట్లు ప్రోత్సహించుచూ వచ్చిరి. వారియొక్క ఆశీర్వచన బలముననే నేనీనాడు ఒక సామాన్య కథా రచయితగా పేర్కొనబడ గలిగితని.

గత యేడాది మత్ప్రియమిత్రుడగు తూతిక త్రినాధం గారి తోడ్పాటున, పరిసరప్రాంత ఆంధ్రుల ధనసహాయముచే "రాష్ట్రేతరాంధ్రావని" యను పత్రికను పూర్తిగావించి పాఠకుల ఎదుట నుంచితిమి. నా ప్రియమిత్రుడును, సహపాఠకుడును యగు శ్రీ ఎల్లేటి క్రిష్ణారావుగారు నేటికి ఆరుమాసాల క్రింతం నుండి "రాష్ట్రేతరాంధ్రజ్యోతి" యను వ్రాత పత్రికను స్నేహితుడు తోట విశ్వనాధంగారి సహాయంతో స్థాపించి నెలనెలా 1, 2 రచనలు నానుండి కోరుచూ రచయితనను భావంనుండి నన్ను తొలగిపోనీకుండా మర్యాదగా నిలుచునట్లు సహాయపడుచూ వచ్చుచుండిరి. తుదకు వారియొక్క ప్రోత్సాహముననే "రాష్ట్రేతరాంధ్రజ్యోతి సాహితీ సమితి"ని నిర్మించి, ముగ్గురు సభ్యులతో ప్రారంభించుట జరిగినది. దీని ఆధ్వర్యాన కొన్ని ప్రచురణకుసుమములు ముద్రింపనెంచి, ప్రథమ కుసుమము నలంకరించుటకు నా కవకాశమొసంగిరి. జానపద గాథలపై నేటి ప్రజలకుగల అభీష్టమును ఎఱ్ఱింగియే యీ కథను ప్రారంభించినాడను. వాస్తవికత కెంత దగ్గర నుండునను విషయ, విమర్శన చేయక మనోరంజన సాధకముగా మాత్రమే యీ కథను పూర్తి జేసినాడను. దోషములను బుధజనులు క్షమింతురు గాక!

పైవారందరితోబాటు పుస్తకమునకై ప్రోత్సహించిన షాహుకారు సోమనాధం సర్దారు, బుక్కా లచ్చన్న, పురుషోత్తమ పట్నాయక్ మొదలుగాగల సజ్జనులను యీ సమయమున స్మరింపక నుండజాలను.

1—1—1953,
పిల్లెంబాడి,
టిటాఘర్.

ఇట్లు బుధజన విధేయుడు,
మానెం లింగరాజు.

# విజ్ఞప్తి

నా శిష్యుడగు మానెం లింగరాజు వ్రాసిన యీ చిన్న జానపద గాధను ఆమూలాంతం చదివితిని. కొన్ని పుస్తకములు మనోరంజక సాధకములుగను, కొన్ని నీతిదాయకములుగను, మరికొన్ని వైరాగ్యయుక్తముగను వుండును. ఇది నీతినీ, మనోరంజక సాధకమునూ సమకూర్చుకొని యున్నది. లింగ రాజు వయస్సులో పిన్నవాడయి రచనలలో ప్రధమానుభవంగా అచ్చొత్తించుట జరుగుచున్నది గనుక సహృదయులు యీ చిన్ని పొత్తమును పరిశీలించి యీతనికి భవిష్యత్తున కొంకింత వుత్సాహము లభించుటకై చెరియొక ప్రతిని తీసుకొనుటకు ఆహ్వానించుచున్నాను.

ఇట్లు

సజ్జన విధేయుడు,

**నల్లి యిమ్మానుయేలు మాష్టరు.**

# విజయ - విక్రములు

## మొదటి ప్రకరణము.

శా॥ పుత్రుల్ నేర్చిన నేరకున్న జనకుల్ పోషింతు రెల్లప్పుడున్
మిత్రత్వంబున బుద్ధిచెప్పి దురితోన్మేషంబు వారింతురే
శత్రుత్వంబు దలంప రిట్టియెడ నా సౌజన్యరత్నాకరుం
బుత్రున్ లోక పవిత్రు దండ్రి మిగులం బాధింప నెట్లోర్చెనో.

(భాగవతము)

ఎవ్వారు పురాకృత ఫల మనుభవించవలసి యుందురో వారు నీటియందు జొచ్చినను, మేరుపర్వత మెక్కినను, రణ రంగమున వైరివీరుల గెలిచినను, ప్రభుసేవ జేసినను, సమస్త కళల నేరింగినను కర్మవశం బగుటవలన రాబోవునది యైతీరును. ఇంతియే గాక పౌరాణికంగా నేమి, చారిత్రాత్మకంగా నేమి మానవుడు చేయజాలని ఘనకార్య మెద్దియును లేదని నిర్ధారణ చేసుకున్నప్పటికీ మానవుడు అసంపూర్ణుడనియూ, ఆతడింకొక అద్భుత శక్తి సంచితుడగు పురుషశ్రేష్ఠుని అధీనమం దుండవలె ననియూ, అతడే మానవజాతి పుట్టుకకునూ, మనుగడకునూ, గిట్టుటకునూ కారణభూతుడనియునూ, భయపడవలసి గాని, లొంగియుండవలసి గాని, సమర్పణ కాగలుగవచ్చునప్పుడు గాని అయ్యది ఆ ఏకైకనారాయణుడగు భగవంతుని ప్రమోలనే గాని, లేక అతని వుపదేశముల సమక్షముననే గాని బాహ్య ప్రపంచ దుష్టశక్తుల సమక్షమున కాదని బుజువగుచునే వచ్చు

చున్నది. అట్లుగాక అధికార సమన్వితుడు, అహంకారుడు అగు మానవుడు బలాత్కారమున కోటిమానవుల హక్కులను లేక గౌరవ మర్యాదల సమర్పింప జేసుకొని విజయుడనైతినని గాని, అధికుడనైతినని గాని తలంచిననూ అది తాత్కాలిక విజయమే యనియూ, తనను తలదన్నిన శక్తికి నేడుగాకపోతే రేపు లేక ఏదో యొకనాడు తన సర్వస్వము సమర్పణ జేయవలసి యుండుననియూ, యితరులను తనకు ఉపకరణముగా జేసుకొనువారు తా మితరుల కుపకరణముగా నుండవలసి యుండుననియూ, సృష్టియందలి జీవుల హింసించుట సృష్టికిని పరమేశ్వరునకునూ కళంక మాపాదించుటే యనియు, అట్టి దుర్మార్గపు పనికి ఒడిగట్టుకొని పుట్టగతులు లేకుండా పోవుట అనర్థదాయక మనియూ జ్ఞప్తియం దుంచుకొనవలసియే యుండును. ఈ సిద్ధాంతాన్నే చరిత్రకారులు పరిపరివిధముల పలు గ్రంథముల ద్వారా బోధించిరి. యీ విజయ విక్రముల గాథయు తద్విషయక ప్రస్తావననే మరింత సమర్థించుచున్నది. ఇందుకు కథాక్రమం బెట్టిదన :

మణిపురమును న్యాయసింహుడనే రాజు పరిపాలించుచుండెను. అతనికి అంగారకపురమునేలు అర్జునసింహుని కుమారై ప్రభావతితో వివాహము జరిగెను. అతడు న్యాయమార్గమున ప్రజాపాలనము చేయుచు న్యాయసింహుడనే పేరును సార్థకపరచుకొనెను. అతడు ధార్మికుండును, నీతిమంతుడును, వినయశీలుండును, బుద్ధికుశలుండును యగుటచే తన రాజ్యమందలి

జనుల నందరినీ బిడ్డలవలె జూచుకొనుచు వారికి గల జమీనులకు దగిన కప్పంబుల గట్టించుకొనుచు, పేదలైనవారి కుటుంబములకు దగిన వృత్తులేర్పరచుచు, దేవబ్రాహ్మణ భక్తిగలిగి సర్వప్రదేశములందు గోష్ఠులు, చెరువులు త్రవ్వించుచు రామరాజ్యంబువలె పాలించుచుండెను. అతనికి బుద్ధిమంతుడు అను మంత్రి గలడు. అతడును రాజును కెట్టిముప్పు వాటిల్లనీయకుండా కంటికి రెప్పవలె రాజునూ రాజ్యమునూ గాపాడుచూ యథాయుక్తముగా మెలంగుచు, ఇంద్రునిచెంత బృహస్పతియుంబోలె సకల రాజ్యభారమును వహించి యుండెను. రాజు మంత్రి నెన్నకును ఎడబాయక వాని యాలోచనానుసారముగా రాజ్యమును యేలుచుండెను. రాజుభార్య ప్రభావతి పేదలపాలిట పెన్నిధియై, ఆశ్రితులకు కల్పలతయై పరిచారికలకు తల్లియై రాజగృహమునకు లక్ష్మియై యుండెను. యింతియే గాక పాతివ్రత్యంబున రెండవ యరుంధతి యని కొనియాడబడుచు భర్తకనుకూలవతియై, సర్వ శుభలక్షణంబుల కాటపట్టై మెలంగుచుండెను. స్త్రీమూర్తి పనిచేయునెడల దాసివలెను, ఆలోచన చెప్పునెడల మంత్రివలెను, సరసాన్నము బెట్టునెడల తల్లివలెను, ఓర్పున భూమివలెను, శయనంబున రంభవలెను యుండవలెనను ప్రమాణ మామెయందే చూడవలెను.

ఇట్లా దంపతు లిరువురును ప్రజలను తల్లిదండ్రులవలె బోషించుచు వైభవ సంపన్నులై సంసారసుఖ మనుభవిం

చుండ కొంతకాలమునకు రాణీప్రభావతీదేవి గర్భవతి అయ్యెను. ఉచిత రీతిని తొమ్మిదిమాసములు గడచిత తర్వాత ఒక శుభ ముహూర్తమున ప్రప్రథమంగా పుత్రుడు జన్మించెను. మరియు అద్భుత తేజంబునం బ్రకాశింపుచు నెల్లరకు నానందము గలుగ జేసెను. రాజు తనకు ప్రథమంగా పుత్రుడు జన్మించుటను విని పరమానంద భరితుడై సద్బ్రాహ్మణుల రావించి జాతకమును వ్రాయించి జనన లగ్నంబును బట్టి వానికి విజయుడని నామ కరణము చేయించెను. నామకరణ మహోత్సవమునాడు రాజు బీదసాదలకు దాన ధర్మములు చేయించెను.

మరికొన్నాళ్లైన తర్వాత రాణీ ప్రభావతి మళ్ళీ గర్భ వతి యైనది. క్రమంగా నవమాసములూ మోసి మంచి నక్షత్రమున సుఖ ప్రసవమై తిరిగి కుమారునే కన్నది. రాజు యీసారికూడా మిక్కిలి ఆనందించి జ్యోతిష్కులను రప్పించి జాతక కర్మాది క్రియలు నిర్వర్తింప జేయించి పండితుల యిష్ట ప్రకారం విజయుని తమ్మునికి విక్రముడని నామకరణము చేయించెను. రాజు విజయ, విక్రముల పేర్లూ, మరియు వారి బాల్య క్రీడలూ జూచి మిక్కుటమగు ఆనందములో మునిగి తేలుతూ మునుపటికంటె నెక్కుడుగా దానధర్మములు జేయించుచు వేల కొలది ధనమును పంచిపెట్టెను. ఆ బాలు రిరువురును శుక్లపక్ష చంద్రుని పగిది దినదిన ప్రవర్ధమాను లగుచు ముద్దులొలుకు మాటలచేతను, నేత్రానంద మొనరించు జూపులచేతను ఎదుటి వారి హృదయము లాకర్షింపుచుండిరి.

బాల్యంబున వారి మాటలును, జూపులును, నాటలును ఎట్టి విరక్తులకైనను రక్తిని కట్టింపక మానననటు లుండెను. సాముద్రిక శాస్త్రలక్షితులై సర్వావయవసుందరులై యద్భుత తేజఃపరిపూర్ణులగు నాబాలు రిరువురును త్రిభువనవర్ణనీయ సౌందర్యంబున దనరి నొక క్రొంగ్రొత్త యందమును సంపాదింప నొప్పుచున్నట్లు దినదినాభివృద్ధి గాంచుచుండిరి. ఈ సల్లక్షణా కార తేజోవిశేషంబులం దులదూగు పసిపిల్లలం జూచి రాజు మిక్కిలి సంతసించుచు వారికైదవ యేఁడు వచ్చినది మొదలు లోకవిషయంబుల నేమియుం జూడనీయక విద్యామందిర మొకటి కట్టించి యందు వారిని ప్రవేశపెట్టి పలువుర నుపాధ్యాయులను నియమించి కేవలము విద్యాప్రసక్తియేగాని యితర విషయము లేమియు జెప్పవలదని వారికి బోధించి విద్య నేర్పింపదొడంగెను.

సూర్యదర్శనముననే కమలములు వికసించునట్లు గురు వులవద్దనుండి ఒకసారి బోధింపబడినంతనే యాయావిషయముల నాబాలురు గ్రహించుచుండిరి. యిట్లాయిరువురును ప్రతి దినము విడువక క్రమంబున గావ్యనాటకాది గ్రంథములు, తర్క వ్యాకరణాదిశాస్త్రంబులుం జదువుటయే కాక సంగీతకళయం దెక్కుడు ప్రావీణ్యత గడించి పంద్రెండేండ్లగునరికి సమస్తవిద్య లను గ్రహించి నఖండపాండిత్యమును సంపాదించి యసమాన ప్రజ్ఞాధురంధరులైరి. ఉపాధ్యాయులును రాజకుమారుల విద్యా గ్రహణసామర్థ్యమునకు, బుద్ధికుశలతకు, నేర్పరితనమునకు మిక్కిలి ఆశ్చర్యపడుచుండిరి. బాలు రిరువురును ప్రజ్ఞాగుణరూ

పములచే నెల్లరకు నద్భుతము గలుగజేయుచుండిరి. పదియా రేడుల ప్రాయము వచ్చునరకు అశ్వముల నెక్కుచు, గజముల నారోహించుచు సమస్తక్రీడా నైపుణ్యముగలిగి, ధనుర్విద్యల యందును, చిత్రలేఖనమునందును యసమానపాండిత్యమును సంపాదించిరి. ఈ రాజకుమారులం జూచి రూపమును మెచ్చు వారు సహదేవునితోను, నశ్వయానపాటవము జూచువారు నకులునితోను, ఆయుధసాధనము విమర్శించువారు అర్జునుని తోను, మల్లసంగర నైపుణ్యము జూచువారు భీమునితోను, నిరుపమవిద్యాకౌశల్యము గనువారు ధర్మజునితోను సమాన ముగా బోల్చుచుండిరి. రాజూ - రాణీ తమ యిద్దరి బిడ్డలను జూచుకొని మురిసిపోవుచు కాలము గడుపుచుండిరి. మనుష్య లోకమున సుఖంబు విషయము లిట్టివియేగదా! ధనప్రాప్తీ, ఆరోగ్యమూ, ప్రియురాలగు భార్య వశ్యులగు పుత్రులు, ధన దాయకమగు విద్య సౌఖ్యప్రదములని పెద్దలు నుడువుదురు గదా! ఇది యిలా వుండగా ఒక గౌరపక్షి (మగది) యీరాజ మహల్లోనే ఒక చెట్టుపైని నివసిస్తుండేది. దాని కెవ్వరూ స్నేహితులు లేరు. తోడుగా ఆడుపక్షి గూడా లేదు. ఆ పక్షి రేయింబవళ్లు ఒక ఆడుపక్షిని సంపాదించుకోవాలన్న కోరికతో ఎన్నో చోట్ల తిరిగింది. ఐనను దానికే యాడుపక్షీ లభించ లేదు. తుట్టతుద కాపక్షి విచారంతో తనలో తానిలా చింతించింది. "యీ పరిసర ప్రాంతాల్లో నాజాతివారెంతమందో యున్నను నన్నెవరూ వివాహంజేసుకొనుట కిచ్ఛగించుటలేదు. యింతకూ

కారణమేమిటో తెలియకున్నది. 'ఋణానుబంధరూపేణ పతి పత్నిసుతాలయా'యను బుధజనులు వచించుమాట రిత్తది కాదు. నాసహవాసి అని ఎవతె నుదుట నాబ్రహ్మ లిఖించి యుండెనో గదా" యని చింతించుచు యిక యీవూరిలో యుండి ప్రయోజనమేమి గలదు. యింకో వూరికి పోవుటయే మంచిదని తలంచుకొని ఆనాడే ఆవూరును విడిచి సింహాళద్వీపమునకు పోయి అచ్చట శ్యామ అను పక్షితో స్నేహము జేసుకొంది. కొన్నాళ్ళట్లు ఆ పక్షితో స్నేహంగా యుండి ఒక పేద గొరపక్షి కూతురును పెండ్లాడి ఆనందంగా సంసారం గడుపుకుంటూ వుంది. యిలా కొద్ది దినములు సంసారసుఖంలో ఆనందంగా తేలియాడుచుండ ఒకనాడు మగపక్షి తన ప్రాణసఖితో "ప్రియురాలా! నేను స్వగ్రామము విడచి చాలాకాలమైంది. తిరిగి అచ్చోటకు పోవాలన్న వాంఛ కలుగుతూంది. నీవుద్దేశమేమి"టని యడుగ నప్పుడా స్త్రీపక్షి "ప్రాణనాథా! మీరీ విషయం నన్నెంచుల కడుగుచున్నారు. స్త్రీ ఎల్లప్పుడు భర్త అధీనంలో వుంటూ భర్త ఆజ్ఞను మన్నిస్తూ యుండాలి కదా! ఏస్త్రీ భర్త ఆజ్ఞను తిరస్కరించి ప్రవర్తిస్తుందో అది మరోజన్మలో బాల్యములోనే విధవరాలౌతుందని శాస్త్రము లుద్ఘోషించుటలేదా?" అని యింకేనేమో ప్రియవచనములు పలికింది. యీమాటలు విన్న మగపక్షి ఆనందంతో కౌగలించుకొని వెంటనే ప్రయాణసన్నాహాలు జరిపి సింహాళద్వీపము విడచి స్వగ్రామమైన మణిపురము చేరుకొని మొదట వున్న

రాజమహాల్లోని చెట్టుపై నున్న గూడులో తన భార్యతో కాపురం పెట్టుకొంది. కొన్నాళ్ళనంతరం ఆడుపక్షి యిద్దరు బిడ్డల్ని కన్నది. బిడ్డల్ని కనిన కొలది దినములకే ఆడు పక్షి వున్నట్టుండి హఠాత్తుగా మరణించింది. తల్లి లేని బిడ్డల్ని పోషించుట మహాకష్టమనిపించిందా మగపక్షికి. తానెన్ని యిడుములు పడి బిడ్డల్ని పెంచుచున్నను, తల్లి లేని కొరత కన్పిస్తూనే వుంది.

ఒకనాటి సాయంకాలము విజయ, విక్రములయొక్క తలిదండ్రులు మహాలులో చల్లగాలికి విహరిస్తూయుండగా మగ గౌర పక్షి యింకో క్రొత్త ఆడు గౌరపక్షితో రావడం రాణీ ప్రభావతి చూసింది. రాణీ చూస్తుండగానే ఆ మొగపక్షి తన క్రొత్త ఆడుపక్షితో గూడులోనికి ప్రవేశించడమూ, వెంటనే ఆడుపక్షి రెండు పక్షిపిల్లలను క్రిందకు త్రోసివేయడమూ ఆ రెండు పక్షిపిల్లలు క్రిందపడి ప్రాణాలు గోల్పోవడమూ క్షణంలోనే జరిగాయి. ఈ సంఘటనను చూచిన రాణీకి మనస్థైర్యం తప్పి మొదలునరికిన చెట్టువలె నేల కూలబడింది. మూర్ఛపడి యున్న రాణీకి వుపచారాలు చేయించగా కొంతసేపటికల్లా స్పృహ వచ్చింది. అప్పుడు రాజుకు కొంత స్థిమితం చిక్కింది. రాజు రాణీని సేదదేరుస్తూ విషయ మడుగగా రాణీ యిలా చెప్ప దొడంగినది.

"మహారాజా! మన యీ మహాలుకు ఎదురుగా వున్న ఆ కనిపించే వటవృక్షంపైని ఒక గౌరపక్షి యున్నది. దాని

తొలిభార్యకు యిద్దరు బిడ్డలుండిరి. తన తొలిభార్య చనిపోయి నందున ఆ మగపక్షి మరొక ఆడుపక్షిని పెండ్లాడి తన గూడు లోనికి తీసుకురాగానే తన సవతిబిడ్డల నిద్దరినీ క్రిందకు పడద్రోసి చంపివేసింద"ని చెబుతూనే ఆ రెండు పక్షిపిల్లల్నీ, చెట్టుపై నున్న గూడును చూపిస్తూ, నేను మరణించిన తర్వాతగూడా మన విజయు, విక్రములకు యిట్టిగతియే పడుతుంది గదా యని దుఃఖముతో మూర్ఛిల్లితి నని చెప్పి ఆయన పాదాలపైబడి భోరున ఏడువసాగెను. రాజు ఆమెను ఓదార్చి లేవనెత్తి ఇట్లు జెప్పెను. "రాణీ! నీవే చనిపోవడం సంభవిస్తే నేను రెండవ వివాహము జేసుకొనను. నేను యిట్టి అవస్థయందు రెండో వివాహము జేసికొని ఏమి సుఖ మనుభవించగలను? దైవాను గ్రహము వలన యిరువురు కుమారు లుండనే యున్నారు. యింకను వారికి వివాహములు జేయవలసి యున్నది. నీవు చని పోవటమే జరిగితే నేను విజయునికి వివాహ మహోత్సవము గావించి రాజ్యభారము వానికే అప్పగించి, అడవికి పోయి తపస్సు జేసుకొందును"అని ధైర్యవచనము లాడెను. రాజు ఎన్ని చెప్పినను రాణికి విశ్వాసం కలుగలేదు. తుదకు రాజుచే ప్రమాణం చేయించుకొని రాజుతో కలిసి నగరులోనికి ప్రవే శించిందా మహారాణి ప్రభావతి. కొన్నాళ్లు గడచినంత రాణి ప్రభావతికి తలవని తలంపుగా మరణము సంభవించింది. యీ ఘోరవార్తవిని, రాజు, రాజకుమారులు నగరమునగల ప్రజలు చాలాచాలా దుఃఖించిరి. యిట్లు కొలది దినములు

గడచినంత యిరుగు పొరుగుల రాజులు తమతమ కుమార్తెలను వివాహము గావించుకొనవలసినదని వర్తమానము లంపు చున్నను రాజు నేనిక పెండ్లాడదలచుకోలేదని తిరిగి వర్తమాన మంపుచుండెను.

ఒకనాడు మంత్రి రాజుతో యిట్లనెను. "రాజా! మీరిట్లు వచ్చిన ప్రతీసంబంధమును తిరస్కరించుట వుచితముగాదు. మీరిక పెండ్లిజేసుకొనకున్న మీకుటుంబభారమెవరు వహించెదరు? గృహిణిలేని సంసారమెట్లు గడుస్తుంది? మీపుత్రుల నెవరు పోషింతురు? వీరన్ని విధముల ఆలోచించి పునర్వివాహము చేసుకొనవలసిందని ఎన్నోవిధముల నచ్చజెప్పుటయేగాక గట్టిపట్టుబట్టుటచే ఎట్టకేలకు మంత్రిమాటలకు తలయొగ్గవలసే వచ్చింది రాజుకు. రాజు అప్పుడు మంత్రితో ఇట్లనెను. "మంత్రీ! నా శరీరసౌఖ్యానికే గాక నాకుటుంబభారమును వహించి నా పుత్రులను సాకుటకైయే నేను పునర్వివాహమాడెదను. మనతో సమానమగు రాచకుటుంబమునుండి మనము రాణిని ఏరుకొని వివాహం జేసుకున్నచో సమాన హోదా ననుసరించి పుత్రుల నిరువురనూ వాత్సల్యంతో చూడకపోవచ్చు. అట్లుగాక పేదయింటి బిడ్డనే నేను వివాహమాడిన యెడల నిరుపద్రవురాలై ఆమె తన బాధ్యతను దెలుసుకొని ప్రవర్తించును." అని రాజు నుడువగా మంత్రి ఆనందభరితుడై పెండ్లి ప్రయత్నములలో దిగి తన యాస్థానమందున్న పౌరోహితుల నందరినీ రావించి రాజుకు తగిన అందగత్తెయును, పేదవంశ

సంజాతయును యగు ఓ చక్కని కోమలాంగిని పరీశీలించ నంపించెను.

పౌరోహితులు దేశం నలుమూలలా వెదకి వెదకి ఒక పేదరాలివద్ద రూపవతియను పేరుగల కన్యయుండుట జూచిరి. యాకన్నియ కడు పేదవంశమున జన్మించి నప్పటికి అందచందా లలో రూపురేఖలలో ఏ రాజకుమార్తెకూ తీసిపోనిది. అతి రూపసౌందర్యరాశియైన యాసుందరిని జూచి పౌరోహితు లచ్చెరువొందీ, ఉప్పొంగీ, వెనువెంటనే యీశుభసందేశాన్ని రాజునకూ మంత్రికీ అందజేసిరి. ఒక సామాన్యాతి సామాన్య మైన యింటిబిడ్డ తనకు రాణీ కాబోవుచున్నదని తెలిసినను రాజు విచారించక పైపెచ్చు ఎంతో సంతోషించి పురోహితులు జూచివచ్చిన కన్యను వివాహమాడుట కెట్టి అభ్యంతరమున్నూ లేదని మంత్రితో అనెను. ఇది విని మంత్రి సంతసించుటయే గాక పురోహితులుకూడా ఉప్పొంగిరి. మరియు ప్రజలు ఉత్సా హాభరితులైరి. మరికొద్ది దినములలోనే ఒక మంచి ముహూర్త మున పేద ముదుసలి కుమార్తె రూపవతితో రాజునకు వివా హము జరిగినది.

రాజు, వివాహమాడిన కొది దినములకే తనరాజ్యాన్నీ, బిడ్డల్నీ, ప్రజల్నీ మరచి క్రొత్తరాణీ రూపవతి ప్రేమకు దాసుడై ఆమె చెప్పినట్లెల్ల నడచుకొనుచుండెను. సౌందర్యము లోలుకు చిరునవ్వులచేతను, వసంత కోయిలవలె ముద్దుల మూటగట్టు మాటలచేతను, మురిపెంపు నడకలతోను, ప్రణయ

పరిణామమునుదెల్పు నేత్రానందపు చూపులతోను, లజ్జచేతను, సొంపగు విలాసముచేతను, భయముచే బెదరిన యాడు హరిణపు చూపుల జూచెడి సుందరాంగు లెట్టివారినైనా వశపరచుకొందురని పెద్దలు వక్కాణించినట్లు రాణీ రాజును పూర్తిగా వశపరచు కొనెను. సవతిబిడ్డలు విజయ, విక్రములను జూచి నప్పుడెల్ల క్రోధపూరిత జూపులు బరపుచుండెను. ఎన్నడైనా ఏదైన తప్పుదొరుకునా, వారిని అడవులకు గెంటించకపోదునా యను ఆలోచనతోనే కాలము గడుపుచుండేది రాణీ రూపవతి. యింతకూ సవతితల్లి సవతితల్లియేకదా! ముందేమి జరుగునో ఎవరు చెప్పగలరు? అంతయు దైవసంకల్పమయే కదా!

ఒకనాటి సాయంకాలము విజయ, విక్రములు బంతి ఆడుకొనుచుండగా వారి బంతి ఒక్కదెబ్బతో సరాసరిపోయి చావిట్లో స్నానం చేసుకుంటూవున్న రాణీ గుండెకు తగిలింది. అప్పుడేమియు ననలేదు గాని, రాజు వచ్చేవేళకు పూర్వం చిత్రాంగి రాజరాజనరేంద్రుడు వచ్చే సమయంలో సారంగ ధరునిపై కినుకజెంది ఏవిధంగా ఒకటికి రెండు చాడీలు చెప్పి కక్షతీర్చుకోవాలని పడుకుందో ఆవిధంగానే పడుకుంది.

రాజు వచ్చినవెంటనే రాణీవద్దకు వెళ్ళి విచారంతో పండుకొని యున్న రాణిని జూచి యిట్లనెను. "రాణీ! నీ వీ రీతిని దుఃఖించుటకు కారణమేమి? నీతో ఎవ్వరైనా పరిహాసము లాడిరా? గేలిచేసిరా? చెప్పుము. వారి శిరస్సు తీయించి

తెప్పించెదను. నిన్నెవరైనా దుర్భాష లాడియుంటే వారిని దేశ మునుండి గెంటివేయించెదను. త్వరగా చెప్పు"మనగానే, రాణీ మెల్లగా లేచి యిట్లనెను. "రాజా! పరిహాసము లాడుటకు గాని, గేలిచేయుటకు గాని, దుర్భాషలాడుటకుగాని యితరు లెవ్వరు సాహసించగలరు? అయినను మిమ్ములను ముందుగా ఒక విషయ మడిగెదను; సమాధానం చెప్పండి. మీరు నన్ను మీ కొరకే పెండ్లాడిరా? లేక మీ కుమారుల కొరకా? నేడు మీ కుమారులు నాయెడ గావించిన అత్యాచారానికి నే నింకనూ గుండె నొప్పితో బాధపడుచునే యున్నాను. మీరు నిజముగా నన్ను ప్రేమించి పొందదలచి యున్నచో మీరీ క్షణమందే విజయ, విక్రములను చంపి వారల గుండెకాయ లను తెప్పించండి. వాటిని నేను తింటేనే గాని నా గుండెలలో గల బాధ నివారణకాజాలదు. నేను చనిపోక తప్పదు;" భామా మణుల బలీయమగు వలపునబడి ఏపనియైనను త్వరపడి, అది మంచిదైనను చెడ్డదైనను చేయబూనుకున్నచో దాని నడ్డగింప బ్రహ్మకైనా శక్యము గాదు. ఇక రాజుమాట వేరే చెప్పనేల? రాణీ ప్రేమకు దాసుడైయున్న రాజు, రాణి మాటలు విని తనలో తా నిట్లనుకొనెను. 'ఇంతకాల మీమెతో సుఖముగా కాలము గడుపుచున్న నా మనస్సు యిప్పుడు యీమె మాట లచే కొండకు తగిలిన ప్రవాహమువలె నిరుదెసల పారుచున్నది. ఇందొక్కటి సహజ సౌందర్యరాశి అనదగు భార్యను త్యజించ వలె; లేదా- విద్యా గుణశీలురనంబరగు పుత్రుల నిరువురనూ

జంపింపవలెను. అయ్యో! హతవిధీ! యిందున నేను దేనిని నిర్ణయించి మనస్సును దృఢపర్చుకొందును? నేయి యని త్రాగుదునా? నూనెయని తలకు పోసుకొందునా? ఏమి దారి? ఎట్లు నిశ్చయింతు, నేమిసేతు' నని పలువిధముల ఆలోచించి తుదకీ విధముగా నిశ్చయమున కొచ్చెను. రాణి బ్రతికియున్నచో చాలామంది బిడ్డలు జన్మించగలరు. సవతితల్లి మాత్రం తల్లి గాదా? తల్లిని గౌరవముగా జూడని కుమారులను వుంచనే కూడదు. పాలసముద్రములో విషముద్భవించినట్లు మా యీ రాజకుటుంబములో యిట్టి అవిధేయులూ, దుర్మార్గులూ అయిన రాజకుమారులు జన్మించిరి. యౌవనము, ధనము, అధికారము అవివేకము యను ఈ నాలుగును యనర్థకమునకు సహాయభూతములు. యీ నాలుగును కలిసి ఒకే చోట యున్నచో నింక చెప్పవలసిన దేమున్నది? కాబట్టి వివేకహీనులును, దుర్మార్గులును యైన బిడ్డల నుంచుటకంటె రాణి మాట కంగీకరించి ఆమె చెప్పినటుల యాచరించుటయే మంచిది. అని దృఢనిశ్చయుడై రాణిని జూచి యిట్లనెను. "ప్రాణప్రియా! మంచిది; నీవు చెప్పినటులే విజయ, విక్రములను చంపించి వారి గుండెకాయలను తెప్పించెదను." అని ముందు వెనుక లాలోచింపకుండా రాజు ఆడుదాని మాటల్లో చిక్కి మూర్ఖుడై పోయెను.

ఇక విజయ, విక్రముల సంగతి ఏవిధంగా ఉన్నదనగా,- వీరిలో ఒక మహాత్మ్యం వుంది. అదేమనిన: వారు ప్రత్యేకంగా

నివసించే భవనమునకు కనుచూపుమేరలో ఒక మహావృక్షం వుండేది. రాజకుమారు లిద్దరూ భవన ప్రాసాదంలో నిలబడి, ఆ వటవృక్షాన్నీ దాని పెద్దపెద్ద వూడల్నీ చూస్తూ ఆవృక్షంపై నివసిస్తుండే పక్షులను గాంచుచు ఉదయాస్తమయములు వినోదంగా గడిపేవారు.

ఆ వృక్షంపైకి ప్రతిదినము సాయంకాలము ఎక్కడి నుండో రెండుపక్షులు తూర్పునుండొకటి, పడమటినుండి మరొకటి వచ్చి కులాసాగా కబుర్లు చెప్పుకొని రాత్రంతా కలసి మెలసి యుండి తెల్లవారగనే ఎవరిదారిన అవి పోతూండేవి. యిటులుండగా ఒకనాటి సాయంకాలమున ఆ రెండుపక్షులు చెట్టుపైకి రావడం రాజకుమారు లిద్దరూ చూచిరిగాని తిరిగి ఎగిరిపోవడం చూడలేదు. ఆరాత్రి మహా జోరుగా గాలివాన వచ్చింది. ప్రతిరోజు చూస్తున్న ఆ పక్షులు ఎందుచేత ఆనాడు ఆ చెట్టును విడిచినట్లు కనబడలేదని యిద్దరు రాజకుమారులూ ఆశ్చర్యపడి భవనం దిగి, చెట్టు దగ్గరకు వెళ్ళిరి. అచ్చటకు పోయి చూడగా ఆ రెండుపక్షులు చెట్టుక్రింద చచ్చి పడి వున్నాయి. రాజకుమారు లిరువురునూ చాల దుఃఖించిరి. ఇద్దరన్నదమ్ములు ఆలోచించి వాటికి దహన సంస్కారాది కర్మలు పూర్తిచేద్దామనే తలంపుకు వచ్చి చెరియొక పక్షిని చేత బట్టుకొనిరి.

ఇంతలో ఆ వృక్షముపైనుండి వీరికి ఏవో కొన్ని మాటలు వినిపించేయి. ఆ మాటలాడుచున్నది ఒక ముసలి

గుడ్లగూబ. అది రాజకుమారులవైపు తిరిగి యిట్లనెను. "రాజ కుమారులారా ! యీ రెండుపక్షులు సామాన్యజాతికి చెందినవి కావు సుమా ! వాటి నివాస మెచ్చటనో గాని కొద్దిరోజుల నుండి మాత్రమే ఈ చెట్టుపైని తాత్కాలికముగా నివాసము చేయ మొదలిడినవి. బుద్ధిమంతులకూ, తెలివైనవాళ్ళకూ, దుర్జనులకు, దుర్మార్గులకు ఎటుల స్నేహము కలిసిపోవునో ఆ విధముగానే యీ రెండింటికీ స్నేహం కుదిరినది. ఈ రెండునూ మొదట పలుకరించుకొన్నవి. తర్వాత వాటిపేర్లు ఒకదాని కొకటి చెప్పుకున్నవి. అప్పుడు నాకు తెలిసింది ఒకదానిపేరు 'ముత్యాలవేణి' యింకొకదాని పేరు 'రత్నాల బొమ్మ' అని. యీ రెండుపేరూ అవి వఠినే పెట్టుకో లేదు సుమా ! వాటిలో అంత సామర్థ్యం కూడా వుంది. వాటి కథలను ఒకదాని కొకటి ప్రతిదినమూ చెప్పుకొనుచుండెడివి. ఆ కథ నిన్నటికే పూర్తి అయినది. అందులోని సారాంశము తేలినదేమన: వాటియొక్క శవ శరీరాలు మీరు చెరిఒకటి పట్టుకొని యున్నారే! వాటిని ఏ మనుజులైతే వెంట్రుకలతో సహా కాల్చివేసి భుజింతురో అట్టివారు నవ్వితే రత్నాలు, ఏడిస్తే ముత్యాలు పడగలవని తెలిసింది. అవిచెప్పిన కథ ఎంతవరకు నిజమో చూడాలని నాకు కుతూహలంగా వుంది. మీ రిరువురూ అన్నదమ్ములు గాన ఎవరో ఒకరు ఆ రెండిటినీ ఉపయోగించి మహాత్మ్య ము సంపాదించుకునేదానికంటె వాటిని కాల్చి చెరియొక వంతు సంయుక్తంగా భుజించి ఈ పక్షులు చెప్పుకొని గర్వించే

మాటలలో ఎంత నిజానిజము లున్నవో కనబరచండి" అంది, ముసలి గుడ్లగూబ.

రాజకుమారు లిరువురూ పక్షులభాషను ఎరిగిన వారగుటచేత ఆ గుడ్లగూబ చెప్పినమాటలను వివరంగా గ్రహించుకొని అచ్చోటనే ఆ రెండుపక్షులను కాల్చి చెరిసగంపుచ్చుకొని యిరువురూ పూర్తిగా భుజించి మొట్టమొదట తమ అమాయకత్వానికి తామేనవ్వుకున్నారు. నవ్వినదే తడవుగా యిరువురి నోటివెంబడి రత్నాలురాలినవి. అయ్యో! యింతటి మహిమ గల పక్షులు చనిపోయినవేయని ఏడ్చారు. వెంటనే కండ్లవెంబడి అశ్రువులకు బదులు ముత్యాలుపడ్డాయి. ఆ రాజకుమారులిరువురూ గుడ్లగూబ యీ రేతుకుచెప్పి పుణ్యంగట్టుకున్నందుకు ఎన్నో అభివందనాలర్పించి యింటికి చేరుకున్నారు.

నాటినుండీ వారు నవ్వితే రత్నాలు, ఏడిస్తే ముత్యాలు రాలేవి. యిలాంటి మహాత్మ్యము వారిలో వున్నదని తెలిసియుండియూ లక్ష్యపెట్టకుండా రాజు స్త్రీ ప్రేమకు దాసుడై తిన్నగా దర్బారునకు వచ్చి తలారివారిని పిలపించి విజయవిక్రములను చంపి, వారి గుండెకాయలను తీసుకొని రావలసిందిగా ఆజ్ఞాపించెను. యీ మాటలువిన్న తలారులు ఆశ్చర్యపడెరి. గాని ఏమియు ననజాలకుండిరి. రాజాజ్ఞను ఎవరుదాటగలరు? గాని విజయ, విక్రములు ఎట్టినేరముజేసిరి? ఎందులకీ మరణదండన విధించడమైనది? యని పరిపరివిధముల ఆలోచించసాగిరి. ఐనను రాజాజ్ఞ మీరుటవారితరమా? గనుకనే తలా

రులు విజయ విక్రముల కాళ్లుచేతులను బంధించి అడవుల్లోనికి గొనిపోవుచుండ, రాజకుమారులిరువురు తమ దౌర్భాగ్యము నకు చింతించుచూ కన్నీరుకార్చిరి. వారికన్నీటి బిందువులకు బదులు ముత్యాలురాలుచుండ తలారులు వాటినియేరుకుంటూ గమ్యస్థానము చేరుకొనిరి.

ఇంతలోనే వెనుకనుండి ఎవ్వరో గుర్రముపై వచ్చు చున్నట్లు సందడి యయ్యెను. అందులకు తలారులు వెనుకకు దిరిగిచూడగా మంత్రిపుంగవుడగు బుద్ధిమంతుడు వారికి ప్రత్యక్ష మయ్యెను. తలారులు మంత్రికి సాష్టాంగము చేసి "రాజకుమా రుల యకారణ హత్యకు యీ దౌర్భాగ్యులను భాగధేయు లుగా నొనర్చుట పాడియే?" యని అభ్యర్థింప మంత్రియూ తన వుద్దేశమున కనుకూలురుగ తలారులు యుండుటెరింగి ప్రత్యక్ష ముగా తలారులతో నిట్లనెను. "తలారులారా! నేను చెప్పినది బాగుగావిని మీ మీహృదయములతోగూడా ఆలోచించండి. రాజుగారి ఆలోచన ఎల్లకాలము ఒకేలాగుండదు. యీ వేళ కోపముతో చంపించివేయుచున్నారు. మరికొన్నాళ్లనంతరము తిరిగి వారిబిడ్డలను అడిగినచో ఎట్లు తెచ్చి యివ్వగలము? అప్పుడు మనప్రాణాలకే ముప్పు వాటిల్లునేమో? అందుచేత వీరిని విడచిపెట్టుటయే మంచిదని నా వుద్దేశమునకు తోచు చున్నది. యీ విషయము మనకు తప్ప యితరులకు తెలియ కూడదు. అట్లు మీలో నెవ్వరైనా యీ గుట్టును బయలుపరచి రేని నా కరవాలమున నరికివేతును సుమా!" యని బెదరింప,

తలారులునూ బుద్ధిమంతుడగు మంత్రి చెప్పిన చొప్పున ఒప్పుకొనిరి. అటుతర్వాత మంత్రి తన నెలవున కరిగెను.

తలారులును రాజకుమారులిరువురను ఆ యడవులలోనే విడచిపెట్టి రెండు కుక్కలను చంపి వాటి గుండెలను భద్రపరచి తిరిగివచ్చుచుండ వారిలో ఒకడిట్లనెను. "ఒరే నర్సన్నా! ఒకవేళ రాజు యియ్యవి విజయ విక్రముల గుండెకాయలేనా అని ప్రమాణంచేయిస్తేనో?" "ఏమవుతుంది, ఒకరినికాపాడేటందుకూ, ప్రాణాన్ని రక్షించేటందుకూ అబద్ధమాడవచ్చునంటారు పెద్దలు; గనుక ప్రమాణం చేసివేద్దాంలే" అన్నాడింకో తలారివాడు. మరికొంతనడచి నగరం సమీపించినంత, మరియొక తలారివాడిట్లనెను. "యేనాటికైనా ఆ రాజకుమారులు మన రాజుగారి కంటబడితే ఎలాగురా?" "మేముచంపిపారేశాము. భగవంతుడు వారినిరక్షిస్తే మాదోషమేమిటి" అందామన్నాడింకో తలారివాడు.

"చచ్చినవారు బ్రతుకగలరటరా" అని ప్రశ్నించాడొకడు.

"సారంగధరునిగూడా తలారులు చంపిపారవేశారు. ఆయనమాత్రం బ్రతుకలేదటరా? అని సమాధానమిచ్చాడు మరొకడు. ఇట్లువారివారికి తోచినరీతుల సంభాషించుకొనుచు రాచనగరును ప్రవేశించి భద్రపరచి యుంచిన గుండెకాయలను రాజునకందించి తమ తమయిండ కరిగిరి. రాణీ రూపవతి

తన పంతం నెగ్గించుకొన్నందుకు ఎంతో ఆనందించింది. నాటి నుండీ రాజు – రాణీలు నిశ్చింతగా కాలం వెళ్లబుచ్చ సాగిరి.

ఒకనాడు మహారాజు వుద్యానవనంలో విహరిస్తూ వుండగా తన మొదటిరాణి ప్రభావతీదేవి ఆడినమాటలు తలంపు కొచ్చాయి. వాటినన్నిటిని ఒక్కటొక్కటిగా జ్ఞప్తికదెచ్చుకొనుచుండ తుదకొకమాట "నేనుచనిపోయినచో విజయ, విక్రములగతి యీ గొరపక్షి పిల్లలవలెనే జరుగుతుంది కదా!" యన్నట్లు స్ఫురించింది. ఆ నాడామె పలికినపలుకులు అక్షరాల జరిగినై. పరిమితిలేని సందేహములగలిగించి, వినయము లేనిదై, మిక్కిలి సాహసముకలదియై, కపటముకలిగి అవిశ్వాసమును బుట్టించి, సకలమాయల సేకరించి, జూపున కమృతమైయుండి హృదయమున విషముకలదియై, పురుషుని బంధనమైనదియగు వనితాయంత్రముయొక్క మోసపు మాటలలోచిక్కి మూర్ఖుడ నైపోతినిగదా! యని పరిపరివిధముల దుఃఖింపసాగెను.

రాజునకు నాటినుండి అన్నపానములు రుచింపవయ్యెను. ఎవ్వరువచ్చినను ఏమడిగినను సమాధాన మివ్వకుండెను. రాత్రింబవళ్లు చింతించుచూ, పుత్రశోకముతో దుఃఖించుచూ, యున్నటువంటి రాజునకు కొన్నాళ్లకు దృష్టిమాంద్యము కలిగింది. ఇక ఆ నాడు తలారులచే విడువబడిన విజయ, విక్రముల గతి ఏమయిందో చూడండి.

## రెండవ ప్రకరణము.

గీ. తలవని తలంపుగా నెందు గలుగుచుండు
శుభము లశుభంబు లనవని చోద్యముగను
వాని కరయంగ గర్త యెవ్వాడు లేడు
సర్వ మీశ్వరాయత్తమై జరుగుచుండు.

ఎట్టివారికైనను ప్రారబ్ధ మనుభవింపక తప్పదు కదా! ప్రాణి శుభాశుభములకు కర్మయే కారణమగుచుండును. కర్మకు వశుడుగాని వాడొక్కడును లేడు. హరిశ్చంద్రుడు, నలుడు, పురూరవుడు మొదలుగాగల పుణ్యపురుషులు కష్టములపాలగుట విధిలిఖితమునేకాదా!

తలారులచే విడిచిపెట్టబడిన విజయ విక్రము లిరువు రన్నదమ్ములును తిరిగి తిరిగి ఒక అడవిని చేరుకొని చీకటి పడినం దున ఒక చెట్టుక్రింద విశ్రమించిరి. ప్రయాణపు బడలికచే విజ యుడు త్వరగా నిద్రపోయెను. గాని విక్రముడు మాత్రము నిద్రింపక మెలుకువగా నుండెను. వీరున్న చెట్టుపైని మైనాపక్షి దంపతులు వాసముచేయుచున్నవి. ఆడపక్షి మగపక్షిని ఏదైన కథచెప్పమని కోరింది. కథచెప్పడం మాటకేమిగాని నేనొక విషయం చెప్పెదను వినుమని మగపక్షి యీ విధంగా చెప్ప దొడంగినది. "ఇప్పుడు మన యిరువురి జీవితాల్లో శుభఘడియలై యున్నవి. ఈ సమయమున మన మాంసము తిన్నవారికి త్వర లోనే రాజ్యప్రాప్తి గలుగుతుంది. యీ మాటలు

చెట్టుక్రిందను మెలుకువగానున్న విక్రముని చెవిని పడగానే ఒకే బాణముతో, రెండుపక్షులకు తగులునట్లు గురిచూచి కొట్టడం ఆ దెబ్బకు రెండును ఒకేసారి గిజగిజ గింజుకొని నేలకూలడం జరిగింది. విక్రముడు పరుగెత్తుకొని పోయి ఆ రెండింటిని చేత బట్టుకొని యిట్లుతలంచెను. నేను మగపక్షినితిని ముందునేనే రాజునైతే. నాయన్న నావద్ద పరిచారకుడుగా వుండటం భావ్యం కాదు. తానే ముందు రాజై నేనతనిక్రింద పరిచారకునిగా నియమింపబడడం ధర్మమై యుండగలదని తలంచి, వాటిని గుడ్డలో మూటగట్టి తలక్రింద పెట్టుకొని నిద్రపోయెను. వుద యాన్నే విజయుడు ముందుగా మేల్కొని విక్రముని మేల్కొ లిపి ప్రయాణం సాగించమనెను. కాని విక్రముడు అన్నతో, "అన్నా ! మనము ముందుగా దంతధావనాది కృత్యములు దీర్చుకొని నేను నిన్నటిరేయి వేటాడియుంచిన పక్షులను భుజించి ప్రయాణంసాగించుద" మనెను. మార్గంలో ఎక్కడైనా నిప్పులు లభిస్తే కాల్చుకొని తినవచ్చునని చెప్పగా విక్రముడు పక్షులను కట్టియుంచిన మూటను చంకనిడుకొని విజయునివెంట బయలుదేరెను. దారిలో నొక చోట కట్టెలు కాలుచుండుట జూచి అచ్చోటునకుపోయి ఆ రెండు పక్షులునుకాల్చి సమీప మున యున్న తటాకంలో కాళ్లు, చేతులు, కడుగుకొని విజయుడు మగపక్షిని, విక్రముడు ఆడుపక్షినితిని, తిరిగి ప్రయా ణం సాగించునంతలో ఒక సింహము వారియొద్దకువచ్చి

యిట్లుంది. రాకుమారులారా! మీ అదృష్టము బాగుపడేదే గాని దాన్ని మీరే చేతులారా జారవిడుచుకున్నారు. మీరా పక్షులను కాల్చకుండా పచ్చిమాంసమే తినియుంటే యింత టితో మీ కష్టాలు గట్టెక్కియుండేవి. మీరు వాటిని సమయం దాటించి తినడమేగాకుండా కాల్చుకొని తినడంవల్ల గొప్ప పొరపాటు జరిగింది. చేజిక్కిన యదృష్టాన్ని కాలదన్నిన వారె వరైనా యుందురా? అని చెప్పి సింహము వెళ్ళిపోయింది. ఎట్టి బుద్ధిమంతులకుగాని బుద్ధిహీనులకుగాని సుఖమో, దుఃఖమో ఏకాలమందేది యనుభవింపవలెనో దాని ననుభవింపక తీరునా? ప్రాణులకు సుఖదుఃఖములు సహజములే. మా అదృష్ట మేలా గుందో దానిననుభవింపక తప్పునా యని చింతించి అచ్చోట నుండి బయలుదేరిరి. వారలా పోయి పోయి మిట్టమధ్యాహ్నపు టెండకు తాళలేక, ఆకలిబాధ దహింపుచుండ పిక్రముడు, "నడువ శక్తిహీనుడనైతిని. నీవీ చెట్టెక్కి సమీపమున యేదైనా నగరము కనిపిస్తుందేమో చూడ"మనెను. విజయుడు చెట్టెక్కి పడమరదిక్కుగా నొక నగరముండుట గాంచి, తన తమ్ముని నచ్చోట కట్టెలు ప్రోగుచేయమని చెప్పి తాను ఏవైనా తిను బండారములను తీసుకొని వచ్చుటకై నగరమువైపుకు బయలుదేరెను.

ఆ సమయములో విజయుడు వెళ్ళియున్న హేమపుర మందు స్వయంవరమునకు ఏర్పాట్లు జరిగివున్నాయ్. దేశదేశా లనుండి రాజకుమారులు వచ్చి స్వయంవర మండపమునంద

లంకరించియుండిరి. ఆ మండపములో ఒక ఏనుగు తొండానికి పూలదండను తగిలించియున్నారు. ఆ దండను ఏరాజుకుమారుని మెడనలంకరిస్తుందో వానినే ఆ దేశపు రాకుమార్తె విద్యావతి వివాహ మాడుతుందని నిశ్చయించారు. అచ్చోటునకే విజయుడుకూడా వచ్చి దూరాన నిలుచుండి చూచుచుండెను. ఏనుగు స్వయంవరానికి వచ్చియున్న రాకుమారులందరినీ తప్పించుకపోయి దూరంగా నిలబడియున్న విజయుని మెడ నలంకరించిందా పూలదండతో. విజయుడు నివ్వెరపడి ఏమియుం దోచక చూచుచుండెను. స్వయంవరమునకు వచ్చియున్న రాకుమారులందరూ నిర్ఘాంతపడి యీ ఏనుగుకు పిచ్చెత్త లేదుకదా! లేకుంటే ఎవడో బిచ్చగాని మెడలో దండను ఎందుకుపడ వేస్తుంది అంటూనే వారిలో ఒక రాకుమారుడు పోయి అతని మెడలోనున్న దండను బైటికి వూడదీసి తిరిగి ఏనుగు తొండానికి తగిలించెను. ఏనుగు సభనంతా మూడు సార్లు ప్రదక్షిణముచేసి తిరిగి విజయుని మెడనే అలంకరింపజేసిందా పూలదండను. యీ దృశ్యాన్నంతా జూస్తున్న రాకుమార్తె విద్యావతి తనలో యిట్లు చింతించింది. ఎట్టి పౌరుషము గాని దైవగతి విపరీతమైనప్పుడు, పెద్దలునుడివినట్లు నాకర్మానికి యీ బిక్షుకుడే లిఖించియుండ నోపు. లేకున్న యీ ఏనుగు ఆ పూలదండను అతని మెడలోనే ఎందుకు వేస్తుంది. నేను కష్ట మనుభవించ వలసియుండగా సుఖమెట్లు ప్రాప్తిస్తుంది. అని పరిపరి విధాల తలపోసి తండ్రితో తను ప్రతిజ్ఞానుసారంగా

వానితోనే వివాహం స్థిరపరచవలసిందని చెప్పింది. కోడనే రాజు విజయుని యేనుగుపై నెక్కించుకొని నగరులోనికి తీసుక వచ్చి స్నానంచేయించి దుస్తుల ధరింపజేసి అతని స్థితిగతుల నన్నింటిని వివరంగా అడిగి తెలుసుకొని మరుక్షణమందే ఆ స్వయంవర మండపములో వివాహం జరిపించెను. పిమ్మట స్వయంవరమునకు వచ్చియున్న వారిలో మధుకరుడనే రాజ కుమారుడు కోపముతో లేచి యిట్లనెను. యిచ్చట స్వయం వరము జరుగనేలేదు. రాకుమారులను అవమానం చేయుటకే యీ స్వయంవరము కృత్రిమంగా రచింపబడ్డది. నేనే నిజమైన రాజకుమారుడనైతినేని నా కిచ్చోట జరిగిన పరాభవమునకు బదులు నాబొందిలో ప్రాణముండగా నేను రాకుమార్తెను అపహరించి తీరెదనని ప్రతిజ్ఞచేసి తక్కిన రాకుమారులతో బాటు మధుకరుడుకూడా వెళ్ళిపోయెను.

అక్కడ అడవిలో విక్రముడు కట్టెలన్నియు ప్రోగుచేసి తన అన్న విజయునికొరకు సాయంకాలమువరకు చూచి ఎంత సేపటికి తిరిగి రానందున విచారించి అన్నను వెదుకుటకై బయలుదేరెను. ఎక్కడను తనఅన్న జాడ కానక మిక్కిలి చింతా క్రాంతుడై ఒక పూలతోట ప్రక్కను కూర్చుండి చింతించు చుండ ఆతోట అధికారి వారివద్దకు వచ్చి చింతించుటకు కారణమును అడిగెను. అప్పుడా విక్రముడు "బాబూ! నేటికి నాలుగు దినాలనుండి నిరాహారముగానున్నాను. నేను చింతించు టకు కారణమేమని చెప్పుదును. నేటి మధ్యాహ్నం మా అన్న

నన్ను నంటరిగా విడిచి ఎచ్చటికో పోయియుండెను. నే నతని కొఱకు వెదకి వెదకి వేసారితినిగాని అతనిజాడ కాన్పించదయ్యె. అందువలననే విచారించుచుంటి"నని తన మనోవేదనను వెల్ల డించెను. ఆకోట అధికారి అతనిని మిక్కిలి ఆదరముగా బుజ్జ గించి ప్రతిజీవికి సుఖదుఃఖము లీశ్వరాధేచ్ఛములు. ధైర్యమే విచారమడంచుటకు దివ్యౌషధము వలె పనిచేయును. గావున ధైర్యమవలంబింప వలయుననిచెప్పి వానిని తన యింటికి గొని పోయి స్నానం చేయించి భోజనము పెట్టించి తనవద్ద కోట మాలిగా కుదుర్చుకొనెను. నాటినుండి విక్రముడు ఏనాటికైనా అన్నను కలుసుకొగల నన్న ఆశతో కోటలోని చెట్లకునీరు పోస్తూ, కోటాధికారి చెప్పినట్లెల్ల నడుచుకొనుచు అతను పెట్టిన ఆహారాన్ని తింటూ దినాల్ని వెళ్ళబుచ్చుచుండెను.

అటు స్వయంవరంలో ప్రతిజ్ఞ చేసియున్న మధుకరుడనే రాకుమారుడు విద్యావతిని తెచ్చి అప్పగించినవారికి తన రాజ్యములో సగభాగము కానుకగా యిత్తునని దండోరా వేయించెను. యీ దండోరా విన్నవారెవరూ అట్టిపనిని చేయ సాహసింపజాలక పోయిరిగాని ఒక ముసలిది మాత్రము విద్యా వతిని తీసుకవత్తునని నిశ్చయించుకొని హేమపురముచేరి ఎట్లో రాకుమార్తె విద్యావతిచెంత దాసీగా కుదిరెను. ముసలిది కొద్దిదినాలలోనే నమ్మకమైన దాసీదనిపించుకొని విజయుని చంప ప్రయత్నించుచుండెను. ఇట్లు కొన్నిదినములు జరిగినంతి

ఒకనాడా ముసలిది పాలలో విషముకలిపి విజయునికివ్వగా, అతడాపాలు త్రాగిన మరుక్షణమే మూర్ఛిల్లి మరణించెను.

విజయుడు అకస్మాత్తుగా మరణించినందుకు విద్యావతి దుఃఖమునకు మేరలేకుండెను. ఆమె కంటినీరు కాల్వలై పారుచుండెను. ఎందరు యోదార్చినను వినుట లేదు. ఎంత ఏడ్చిన నేమిప్రయోజనము? ఆమె రోదన మరణ్యారోదనమే కదా? కొండనుండి పడు ప్రవాహము వలె దుఃఖ మాపరాకుండెను. కష్టమన నేమో ఎరుగని యీ బాలామణి కెట్టి దురవస్థ వాటిల్లినదని అందరు చింతించిరి. ఆహా! ఏమి యీ కాలగతి! మానవులకు సుఖదుఃఖములు, మంచిచెడ్డలు సిరి సంపదలు వచ్చుట పోవుట అతిచిత్రముగ నుండునుకదా! యిట్లే కొన్నాళ్లు గడిచెను. యీ లోపున ముసలిది మధుకరుని వద్ద నుండి యంత్రాలతో అమర్చియున్న ఒక మంచమును దీసుకొనివచ్చి ఒకచోట భద్రముగా వుంచియుండెను. ఒకనాడు ముసలిది మాటల సందర్భమున విద్యావతిని ఆ మంచముపై కూర్చుండబెట్టి అంద మర్చబడియున్న యంత్రాన్ని తిప్పెను. వెంటనే ఆ మంచము పైకెగసి విమానంవలె పైకెగ్గ సాగెను. రాజకుమార్తె ముసలిదానియొక్క మోసబుద్ధిని గ్రహించి తన నాథుని గూడా ఈమెయే చంపియుండునని గ్రహించుకొనెను. తుదకు తనయొక్క శీలాన్ని కూడా చెరుపుటకై ప్రయత్నిస్తుందని వూహించి, ప్రాణహానికైనా నోర్తును గాని మానహాని కోర్వజాలనని నిశ్చయించుకొని వెంటనే మంచముపై

నుండి క్రిందకురకగా ఒక నదీ మధ్యములో పడినది. అప్పుడామె ఆ నదిలో యీదసాగెను. యీ సంగతి ముసలిదాని మూలంగా విన్న మధుకరుడు పశ్చాత్తాపము జెందెను. రాజ మహల్లో విద్యావతి యొక్క తల్లి దండ్రులు చీకటి పడునప్పటికి ముసలిది తన కుమార్తెతో చేరనందున చింతాక్రాంతులై మధుకరుని దంతోరా ప్రకారమే యీ ముసలిది మనవద్ద దాసీగా కుదిరి విజయుణ్ణి చంపి, విద్యావతినిగూడా వానికప్ప గించుటకు తీసుక పోయి యుంటుందని గ్రహించుకొని దుఃఖింప సాగిరి. ఇక విక్ర ముని సంగతి చూద్దాం.

విక్రముడు తోటమాలిగా పనిచేసుకుంటున్న సమయ మందు ఒకనాడు ఆ అడవికే ఒక విమానంపైనుండి ఒకసాహు కారు వచ్చెను. ఆ విమానం ఆ అడవిలో ఆగి ఎంత ప్రయత్నిం చినను నడిచిందికాదు. ఇంతకుముందొకసారి యీవిధలనే జరిగి నప్పుడు వారొక నవయువకుణ్ణి దేవతపేరు చెప్పుకొని బలియివ్వగా నడిచిందట. యిప్పుడుకూడా అట్లా చేస్తే నడు స్తుందేమో నన్న ఆశతో ఎవరైనా కుర్రాణ్ణి డబ్బిచ్చి తీసు కొని బలి యివ్వడానికి వెదకి వెదకి విక్రముడు పనిచేసుకుంటున్న తోట అధికారి వద్దకు వచ్చెను. ఆ తోట అధికారి విక్రముణ్ణి లక్షరూపాయలకు విక్రయించెను. సాహుకారు బలినిచ్చుటకు తీసుకొని పోవుచుండ దారిలో విక్రముడు సంగతులను అడిగి తెలుసుకొని, తానా విమానం నడిపించునటుల చేయుదు ననియు, తనను విడచి పెట్టవలసినదనియు, వారితో వినయంగా

కోరుకొనుటయు, అందులకు వారు అంగీకరించుటయు జరి గింది. విక్రముడు షాహుకారుతో కలసి విమాన మున్న చోటునకు పోయెను. మరియు అందులోని కొన్ని యంత్ర ములను యిటు నటు త్రిప్పగా విమానం యథాప్రకారమే నడువ సాగింది. వాగ్దానం ప్రకారం విక్రముడు విడచిపెట్ట బడెను. షాహుకారుచే విడచి పెట్ట బడిన విక్రముడు తన మరణగండము తప్పనందులకెంతో సంతోషించి, కోట అధికారి గావించిన మోసానికి వగచి తనలో తానిట్లనుకొనెను. వివేక హీనుడైన ప్రభువును సేవించుటకంటె వనవాస ముత్తమము. యాచించు కొని బ్రతుకుటకంటే మరణమే శ్రేయము. ఒకరివద్ద పడియుండి వారుపెట్టు బాధలకు తలయొగ్గియుండుట మిక్కిలి నింద్యము గాన అట్టి యధికారిని సేవించుటం ప్రాణాపాయమని తలంచి యేమియు తోచక దాహము తీర్చుకొనంచి సమీపంలో యున్న నది యొడ్డునకు వెళ్ళగా, అచ్చోట ఒక స్త్రీ మూర్త స్పృహ తప్పియుండగా చూచి ఆమె చెంతకుపోయి యిట్లనెను. దేవీ! నీ వెందుకలాపడి యున్నావు. జరిగిన విషయం చెప్ప మనగా! ఆమె తన చేయిని పైకెత్తింది. అప్పుడు విక్రముడు ఆమెచేతి వ్రేలయందున్న వుంగరమునుచూచి అది తన అన్న విజయునిదని పోల్చుకొని ఆ వుంగరమెట్లు లభించినదని గద్దించి అడిగెను. విద్యావతి మెల్లగా లేచి స్వయంవరమునాటి నుండి అప్పటివరకు జరిగిన విషయమంతయు చెప్పెను. తన అన్న విజయుడు మరణించిన సంగతి తెలుసుకొన్న విక్రముడు

ఏడ్చుచుండగా విద్యావతి తన మరది ఏడ్వడము కోడనే ముత్యాలు రావటం చూచి మనస్సుకు ఒక వంక బాధ, వేరొక వంక ఆశ్చర్యము కలిగించాయి.

మరుక్షణమందే విద్యావతికూడ తన అశువులను బాసింది. విక్రముడు మిక్కిలి దుఃఖించి నేసింక బ్రతికియుండి ప్రయోజన మేమిటని ధృడనిశ్చయుడై ప్రాణాన్ని త్యజింప అచ్చటనేయున్న ఒక చెట్టుక్రింద కురకబోవుచున్నంతలో ఒక ముసలికంఠము రాకుమారా! ఆగుఆగుము అన్నమాటలు వినిపించినవి. విక్రముడు ఆశ్చర్యముతో యీ నిర్మానుష్యమైన ప్రదేశంలో యీ మాటలాడుచున్న దెవరా ? యని చుట్టూ చూచెను. ఇంతలో ఆ ముసలిది విక్రమునివద్దకు వచ్చి రాకుమారా! నీ వెందుల కాత్మహత్య జేసుకొనెదవు ? ఆత్మహత్య మహాపాతకమని పెద్దలు నుడువగా వినియుండలేదా ? నీ వేదో ఆపదలో చిక్కుకొని యున్నట్లున్నావు. సవిస్తరముగా దెలుపుమన విక్రముడు జరిగిన సంగతియంతయు ఆమెకు వెల్లడించెను. ఆమె అతని నోదార్చి రాకుమారా! ఆపత్కాలమందు ధైర్యము గలిగియుండుటయే కదా పురుషలక్షణము. నీవు నాతో రమ్ము. నీ అన్న విజయుని బ్రతికించి నీ దుఃఖమెడ గొపుదునని నమ్మకము బుట్టించి అతనిని తన ‹ తీసుకపోయెను. ఆ యిరువురూ కలసి వెళుతూ కుటీరము చెంత ఆగిరి. అచ్చటంతా భీభత్సమైన వాతావరణంగా వుంది. ఆ పరిసరములోనే ఒక ముని చచ్చిపడియుండెను. ఆ ముసలిది ఆ చచ్చిపడియున్న మునిని చూపించి యిలా

చెప్పెను. రాకుమారా! యీ ముని యెవ్వరోకాదు. యితడు నా భర్త. నే నీతని భార్యను. నే నతని పాదదాసిగావుంటూ యిన్నాళ్లూ గడుపుకు వచ్చాను. ఇప్పుడు నా జవసత్వా లుడిగి పోయినవి. ఈతని పేరు అంగులీకుడు. యీతని పుట్టుకతోనే ఒక మహాత్మ్యముంది. అదేమనిన యీతని ఎడమచేతి చిటికెన వ్రేలి రక్తపుచుక్క ఏ మృతశరీరంపై వేసినా ఆ శవము బ్రతికి తీసుతుంది. అందుచేత యిప్పుడైనా యీయనను తిరిగి బ్రతికించి మరికొన్నేళ్లు జీవించగలమనే ఆశవుంది. కాని యీ నిర్మానుష్యమైన అడవులలో యీ జవసత్వ క్షీణదశలో యింకా బ్రతికియుండుటకు యిష్టము లేకయే ఈ ముని తన యిష్టప్రకారము తనువును చాలించెను. నేనుకూడా రేపీపాటికి చనిపోవ నిశ్చయించాను. మా యిద్దరి అంత్యకోరిక, మా యిద్దరి అంత్యక్రియలు ఎవరు శ్రద్ధగా జరిపింతురో వారికి కానుకగా ఈ మునియొక్క చిటికెన వ్రేలిని కోసియిచ్చుటకు నిర్ణయించుకొంటిమి. తలవనితలంపుగా నీవీ అడవిని చేరుకొంటివి.

ఇదిగో నీవీకత్తిని తీసుకొని యీయన యొక్క చిటికెనవ్రేలిని కోసి, నీ చిటికెనవ్రేలిని తీసివేసి దానిస్థానములో మునియొక్క చిటికెనవ్రేలిని తగిలించి యీ వేరుతో ముమ్మారు త్రిప్పిన యథాప్రకారం కుదుటబడుతుంది. అని చెప్పి తనవద్ద నున్న కత్తిని, వేరును అందించింది. విక్రముడు వాటిని అందుకొని ఆమె చెప్పినట్లే చేసెను. వెంటనే వారిద్దరునూ కలిసి

మునికి అంత్యక్రియలు జరిపిరి. తరువాత ఆ ముసలిది విక్ర మునితో కలసి విజయుని శవమును కాల్చినచోటునకు పోయి యిట్లు చెప్పెను. రాకుమారా! మహాత్ముల యనుగ్రహముచే జీవించువా రనేకులున్నారు. మున్ను హరిశ్చంద్రుని పుత్రుడు లోహితుడు పునర్జీవితు డెట్లయ్యెను? మరియు ఔషధసామర్థ్య మున నేకదా లక్ష్మణుడు పునర్జీవితుడైనట్లు రామాయణగాథ చెబుతుంది. కావున నీ విప్పుడా మహాత్ముని చేతినుండి గొని యున్న చిటికెనవ్రేలిని యీ కత్తిచే చీరి ఆ సంజీవరక్తాన్ని యిచ్చోట చల్లినట్లయిన నీ అన్న తిరిగి సజీవుడగునని చెప్పి ఆ ముసలిది వెనుతిరిగిపడి తనువును చాలించెను. విక్రముడు తనవద్దనున్న కత్తితో చిటికెనవ్రేలిని చీల్చి, అచ్చటనున్న ఎముకలపై రక్తపుచుక్కలను జల్లెను. వెంటనే విజయుడు నిద్ర నుండి లేచువానివలెనె మేల్కొని, ఆహా! ఎంతసేపు నిద్రించితి నని చుట్టూ చూచెను. విక్రముడు అన్నను సజీవునిగా చూచి ఆనందాశ్రువులతో అన్నను కౌగిలించుకొని నాటినుండి నేటి వరకు జరిగిన విషయాలన్నింటిని చెప్పెను. ఆహా! దైవనిర్ణ యము అతిచిత్రమైనదికదా? దైవము దేని నెట్లొనర్చునో ఎవ్వ రును ఎరుగజాలరు. ఒక్కొక్కప్పుడు మేలులో కీడును, కీడులో మేలునుకూడా దైవము సంఘటింపజేయును. అని విజయు డనెను. ఇరువురును తిరిగి కలిసికొన్నందుకు ఎంతో ఆనందించి, ముసలిదాని అంత్యక్రియలు జరిపించి దైవమాయను కొనియా డుచూ అచ్చోటునుండి బయలుదేరిరి.

# మూడవ ప్రకరణము.



**ఉ. ఊవిన నేడవిఘ్నమగునోయని నీచులు భీతిగార్యమే**
**పూనరు మధ్యముల్ దొలుతబూవియు బూనకవిఘ్నమైనచో**
**మానుదురెన్నివిఘ్నములు మాటికివచ్చిన నెంతనొచ్చినన్**
**మానరు తాముబూవిన సమంచితకార్యము ధీరమానసుల్.(తిమ్మకవి)**

ఒక అడవియందు చందనపు చెట్టుపైని హంసదంపతులు నివాసముచేయుచుండెను. ఆ చెట్టుక్రింద పుట్టలో ఒక సర్పము నివాసముచేయుచు హంస బిడ్డలను భక్షించి పోవుచుండెను. హంసలు దీనిని గమనింపజాలక విచారించు చుండెడివి. యీ అడవినే విజయ, విక్రములు ప్రవేశించి ఆ చందనపు చెట్టు క్రిందనే నిద్రించుటకు నిశ్చయించిరి. ఆ చెట్టుపైనున్న హంసలు తమ బిడ్డల్ని విడచి మేతకొరకు బయలుదేరి పోయినవి. అర్థ రాత్రివేళ ఆ చెట్టుక్రిందనున్న సర్పము బుస్సుమంటూ చెట్టు మొదలునంటి పైకెగబ్రాకుచుండ హంసపిల్లలు చౌచౌ మని అరచినవి. యీ అరుపును చెట్టుక్రింద పండుకొనియున్న విజ యుడు చూచి ఆ సర్పాన్ని ఖడ్గముతో ఖండించివేసెను. వుద యమున హంసదంపతులు తమ బిడ్డల కొరకు ఆహారాన్ని సమకూర్చినవి. దినమొక గండముగా గడుపుచున్నందున తమ బిడ్డలకై ఆనాడుకూడా వాటికి ఆశలేకుండెను. గాని అవి వచ్చి నంతనే తమ బిడ్డలు బ్రతికి యుండుటంజూచి భగవంతుని మనంబునం దలంచుకొని తమ బిడ్డలకు మేతపెట్ట బోవుచున్నంత

ఆ రెండు హంసపిల్లలును యిట్లన్నవి. తల్లిదండ్రులారా ! మీ రింతకు ముందెన్నడైనా బిడ్డలను కన్నారా ? లేక మేమే మొదటి సంతతివారమా ? ఇదిగో యీ చెట్టుక్రింద పుణ్యాత్ములు మమ్ములను భక్షించుటకై వచ్చుచున్న సర్పాన్ని సంహరించి మా ప్రాణాల్ని కాపాడిరి. అందుచేత ఆ మహానుభావులు భోజనం చేయునంతవరకు మేమున్ను భోజనం చేయనొల్లమని పట్టుబట్టినవి. యీ సంగతి విన్న హంసదంపతులు రాజకుమారులున్న చోటున కరుదెంచి రోదనచేసినవి. వెంటనే విజయ విక్రములు మేల్కొని హంసలతో యిట్లనిరి. మీరెందుకిలా ఏడ్చుచున్నారు. మేము మీకేమి అపకారముచేసితిమి. నిన్నటి రాత్రిమాత్రము ఒకసర్పాన్ని చంపితిమి. అది మావల్ల నేరమైనచో మమ్ములను క్షమించుడని చెప్పుతూ ఆ సర్పఖండములను తీసుకవచ్చి చూపించిరి. అప్పుడా హంసలు వారితో యిట్లన్నవి. పుణ్యపురుషులారా ! మేమింతకు మున్ను కనుచున్న సంతానాన్ని యీ సర్పమే కాబోలు భక్షించుచుండెడిది. మీరిప్పుడు మాపాలిటి దైవమువలెవచ్చి మా బిడ్డల్ని కాపాడితిరి. మీకు చేసిన యీ వుపకారానికి ప్రత్యుపకారంగా యికనుండి మీకు అగ్ని, రాయి, నీరు దేనిచేతనైనను మృత్యువు కలుగకుండా వరమిచ్చుచున్నాము. అని చెప్పి హంసలు కొన్ని పండ్లను వారి కందించినవి. వారివురు ఆనందముగా భుజించిరి. హంసలుకూడ తమ బిడ్డలతోబాటు కొన్ని ఫలములను భుజించి తిరుగ యిట్లన్నవి, రాకుమారు

లారా! మీలో ఒకరి చేతియందు చక్రమును, యింకొకరి చేతియందు త్రిశూల చిహ్నములున్నవి. మీకు కొద్దిరోజుల్లోనే కష్టాలు గట్టెక్కనున్నవి. అప్పుడే మీ రిరువురకు రెండు రాజ్యాలు లభిస్తవి. మరియు మేము రాజహంసలము. మే మెచ్చోటనుందుమో అచ్చోట ఎట్టి కష్టాలుండవు. కాబట్టి మీలో మాబిడ్డ నొకదానిని గొనిపోయిన మీకే అపాయ మురాకుండా కాపాడ బడుదురు. అని వారిబిడ్డ నొకదానిని రాజకుమారుల కప్పగించగా వారిరువురును హంసలవద్ద సెలవు పొంది ప్రయాణం సాగించిరి.

అలా కొన్ని దినములు ప్రయాణమై వారొక అడవిని చేరుకొనిరి. వారా అడవిలోనికి ప్రవేశించినంతలో భీకరమైన భయమునుగొల్పు గర్జనలు వినిపించినవి. దానికి వారు తల్లడిల్లి హంసతోనిట్లనిరి. మరాళమా! యిప్పుడు వినవచ్చిన ఆ శబ్దనేమి? ఏదైనా శైలము బ్రద్దలైనదా! లేక మహా ప్రళయమేదైనా జరుగనున్నదా? వేగ మా రహస్యము జెప్పి పుణ్యము గట్టుకొనుమన ఆ రాజహంస ఇట్లనెను. రాజకుమారులారా! యీ యరణ్య మందొక బ్రహ్మరాక్షసుడున్నాడు. వాడు ఘోరమైన తపస్సుచేసి బ్రహ్మచే అనేకవరములుపొంది, త్రిమూర్తుల కజేయుడై యక్ష, కిన్నర, గరుడ, గంధర్వాదులను తృణప్రాయముగా జూచుచు తన కంటికగపడు సర్వజీవులను భక్షింపుచు పాపభీతిలేక సంచరించుచున్నాడు. వాని

జోలి మనకేల ? వేరొక త్రోవను మనము పోవుదము రండు రండు అనగా రాజకుమారు లిట్లనిరి. ఆ! ఏమిటి! క్షత్రియ కులమునంబుట్టి ఒక నిశాచరునకు భయపడి వేరొక త్రోవను బోవచ్చునా ? ఇది క్షత్రియధర్మ మగునే ? వానితో పోరాడి త్రిలోకముల కజేయులమగుదుము లేదా వానిచేత మడసెదము. యిందేదేని క్షత్రియధర్మమగును గాని వానికి భయపడి వేరొక త్రోవం బోవజాలమనిరి. అప్పుడా హంస వారి నచ్చోటనే ఒక చెట్టుక్రింద వుండునట్లు నియమించి ఆ రాక్షసుని రహస్యములను తెలుసు కొనుటకై రివ్వున ఎగిరిపోయి ఆ బ్రహ్మ రాక్షసు డున్న ప్రదేశము చేరి ఒక చెట్టుచాటున మణిగి యుండగా ఆ రాక్షసుడు తన సేవకునితో యీ విధంగా సంభాషించు చుండుట వినబడినది.

జ్వాలాముఖుడు :—ఏలికా ! మీరీనాడు యింతఘోరము గా గర్జించుటకు కారణమేమి ? వేగమే మీ సేవకుడనైన నాకు దెలుపుడు.

బ్రహ్మరాక్షసుడు :—జ్వాలాముఖా ! ఇంకెక్కడి మీ యేలికను. (అని కన్నీళ్లు తుడుచుకొనును)

జ్వాలా :—మీరు విచారించుచుండ నా ప్రాణములు నిలువకున్నవి. మీరిలా దుఃఖించుటకు కారణమేమి ?

బ్రహ్మ :—సేవకా ! నా కే దినమున ఆహారము లభించదో ఆనాటినుండి మూడో దినమున మరణము తప్పదని

బ్రహ్మదేవుడు శపించియుండెను. ఇక నేను మూడుదినములే జీవించగలను. (అని ఘోరున యేడ్చి మూర్ఛపోయెను.)

అంతట జ్వాలాముఖుడు అతని కుపచారములుచేసి తేరు కొన్న తరువాత మెల్లన నిట్లనెను. ఏలికా! మీ యాయుష్షు యేదో రహస్యస్థలమున దాచియుంచినట్లు మొన్ననేకదా చెప్పి యుంటిరి. ఇక మీకు భయమెందులకు?" అనిన బ్రహ్మరాక్షసు డిట్లనెను. "ఏడుసముద్రాలమధ్య నొకదీవియందు ఒకతాళవృక్ష మున్నది. ఆ తాళవృక్షము చివరను నొక పంజరమున్నది. ఆ పంజరములో నొక భరిణె యున్నది. ఆ భరిణెలో మూడు తుమ్మెదలున్నవి. ఆ మూడు తుమ్మెదలు మూడు రంగులు గలిగియున్నవి. ఎరుపురంగు తుమ్మెదయందు నా శిరస్సును, నలుపురంగు తుమ్మెదయందు నా హృదయమును, తెలుపురంగు తుమ్మెదయందు నా కరచరణములయొక్క జీవములు నున్నవి. ఆ ప్రదేశమందు నా మాయచే ఒక హంసనుబుట్టించి ఆ హంస సదా ఆ పంజరమును నోటితో కరచి పట్టుకొనియుండునట్లు నియమించితిని. మరియు నా మాయాశక్తిచే సృజింపబడిన వ్యాఘ్ర, భల్లూక, సింహ, శార్దూలాది భయంకర మృగము లను చుట్టూ పహరా వుండునట్లు నియమించితిని. వీటిని నా మాయచే బుట్టించితినిగాన వాటికి మరణములేదు. నా ఆయువు యింత రహస్యముగా వుండగా నన్ను జయించుట కెవ్వరికిని తగినశక్తి లేకున్నను, నాకు మరణ మాసన్నమగుచుండ ఎవ్వ

రద్దుపడగలరు !" అని చెప్పుచునే మూర్ఛపోయెను. అప్పుడు జ్వాలాముఖుడు ధైర్యవచనాలతో యిట్లు పలికెను. "ఏలికా ! నీవింత బేలవైతివేమి ? నీప్రాణాని కడ్డుగా కావలియున్న వారికే మరణము లేనప్పుడు నీ మరణము సంభవమగునే ? నీవిక విచార ముడిగి సంతోషముగా నుండుము. ఈదిన మాహారము దొరక కున్న నేమాయె ! రేపు ఉదయాన్నే నేను పోయి ఏ నరుడినో జంతువునో సజీవముగా గొనితెచ్చి మీ యెదుట నుంచెదను. మీ రా జీవిని భుజించి మీ అధైర్యాన్ని తొలగించు కొనగలరు. చూచుచుండు నా ప్రతాప"మని చట్టున లేచి ఎచ్చటికో పోయెను. వీ రాడుకున్న మాటలన్నియు చెట్టుచాటున పొంచి యున్న రాజహంస విని, రివ్వున యెగిరి, రాజకుమారు లున్న చోటున కరుదెంచెను. హంస వారితో తాను విన్న సంగతులను వివరింపగానే రాకుమారులు భయపడిరి. మొదట మాయా రాక్షసులను, మాయా మృగములను సంహరించితిగదా ! యీ రాత్రించరుని సంహరించ గలుగుదుము. యిదెట్లు సంభవ మగునని విచారించుచుండ హంస వారికిట్లనెను. రాకుమారు లారా ! మీరు చింతింపకుడు. ఇందుకొక వుపాయమున్నది. మీరీ సమీపముననున్న నగరములోనికి పోయి ఒక పంజర మును, ఒక భరిణెను తయారుచేయించి తీసుకొని రండు. నేను తక్కిన కార్యాన్ని సాధించివచ్చెదను. అనగానే రాజకుమా రులు నగరములోనికి పోయి ఒకపంజరమును, భరిణెను తయారు

చేయించి హంస కందించిరి. ఆ హంస వాటిని ముక్కున గరచు కొని రివ్వున ఎగిరి గగనవీధులం బోయి, సప్తసముద్రాల మధ్య నున్న దీవియందొక తాళవృక్షముండుటం గని, ఆ వృక్షము దాపునకు పోయి "మామా" "మామా" యని పిలిచెను. ఇదివిన్న మాయామాహంస బయటకు వచ్చి, రాజహంసను చూచి ఆహా! ఎంతకాలానికి నా జాతివారిని చూచితినని సంతోష ముతో ముక్కున గరచుకొనియున్న పంజరమునక్కడుంచి, ఎవరు నీవు? ఎందుకిచ్చటికి వచ్చితివని యడుగగా రాజహంస యిట్లు చెప్పసాగింది. మామా! నీ సోదరి హిమవత్పర్వతము నందు విష్ణురాక్షసునియొద్ద నొక పంజరమును ముక్కున గరచు కొని యుండుటెరుంగవా? ఆమె కుమారుడ నేనే. ఒకనాడు ఒక సరోవరములో కొన్ని హంసలు విహారము చేయుచుండగా చూచిన నేను మా అమ్మవద్దకు వెళ్ళి మనకు బంధువు లెవ్వ రును లేరా? యని యడిగితిని. ఆమె నేను దుఃఖించుటెరింగి, నా చిట్టి పాపా! మనకు బంధువులెట్లుందురు? మా తల్లిదండ్రు లకు నేను పెద్దదానను, నా తమ్ము డొకడుండెను. స్వల్పకాల ములోనే మా తల్లిదండ్రులిరువురును గతించిరి. ఈ విష్ణురాక్ష సుడు నాతో యిది మనకులాచారమని యీ పంజరాన్ని నా ముక్కున కరచుకొని యుండునట్లు నియమించి యీ పర్వత శిఖరమందుంచియున్నాడు. అతని బావమర్ది బ్రహ్మరాక్షసుడట. సప్తసముద్రాలమధ్య నొక దీవియందు నొక తాళవృక్షముపైని

నా ముద్దులతమ్ముణ్ణి వుంచియున్నాడు. నా ముద్దులతమ్మునిగతి ఆ విధంగాను, నా గతి యీ విధంగాను బ్రహ్మదేవుడు లిఖించి యుండ మనకు బంధువు లెట్లుందురని చెప్పినది. నేను గట్టిపట్టు బట్టుటచే నీ వద్దకు వచ్చుటకు అనుమతించుటయేగాక నీకు నమ్మకము కలుగజేయుటకు ఆనవాలుగా యీ పంజరమును యిచ్చి పంపించినది. నేను మిక్కిలి ప్రయాసపడి నా పూర్వ పుణ్యావిశేషంబున నిన్ను దర్శించుకొనగలిగితి"నని ఏమేమో చెప్పినదా రాజహంస. ఆ పలుకులు విని యా మాయహంస అయ్యో! నా సోదరికికూడా యిదేగతి పట్టినదాయని చింతించి నా ముద్దుల మేనల్లుడా యని కౌగలించుకొని ముద్దాడి కొంత సేపు ఆయాసం తీర్చుకొమ్మనియూ, తన పంజరమును జాగ్రత్తగా చూచుచుండుమనియూ, నియమించి బయటకు వెళ్ళినదా మాయహంస. ఆ మాయహంస వెళ్ళినవెంటనే రాజహంస తా దెచ్చిన భరిణెను ఆ మాయపంజరమందుంచి, రాక్షసజీవిత తుమ్మెదలున్న భరిణెను తన పంజరమందుంచుకొని ఏమీ ఎరుగనిదానివలె పరస్పరంగా కూర్చుండెను. అటు పిమ్మట మాయ హంస కొన్ని పండ్లను గొనితెచ్చి రాజహంసకిచ్చి భుజింపమని కోరెను. రాజహంస వాటిని భుజించి తాను వచ్చినపని నెరవేరి నదికదాయని మనంబునందు ఆనందించి, వెళ్లుట కనుజ్ఞ యిమ్మని వేడెను. మాయహంస తనతల్లి కిమ్మని కొన్ని పండ్లను ఆ పంజరములోనుంచి, తన అక్క పాదాలకు నమస్కరించితిననియు,

తనను దర్శించుటకే పంచప్రాణాలు నిల్పుకొంటినవియు చెప్ప మని చెప్పి, తన అల్లుని ముద్దుపెట్టుకొని పంపివేసెను. రాజ హంస తన ప్రయత్న మతిసులభముగా కొనసాగినందులకు సంతోషించుచు రివ్వున రాజకుమారులున్న చోటున కరిగి తాను తీసుకొచ్చిన రాక్షసుని యాయువుగల తుమ్మెదలుండు భరిణెను వారిచేతి కందించి ఆ తుమ్మెదలను గురించి వివరంగా బోధించి నది. వెంటనే వారిరువురును భరిణెను చేత బట్టుకొని హంసతో బాటు బ్రహ్మరాక్షసుడున్న చోటునకు పోయిరి.

అక్కడ బ్రహ్మరాక్షసుడు తనకొకవంక మిక్కుటమైన ఆకలిబాధయు, వేరొకవంక మరణము సంభవింపనున్నదన్న వేదనయు దహించుచుండ, పండ్లు పటపట కొరుకుచూ, ఏమీ! నా సేవకుడు జ్వాలాముఖుడు నన్ను ఓదార్చి ఏమను ష్యునో, జంతువునో గొనివచ్చెదనని పోయి మూడుదినములైనను రాకున్నాడు. వానికికూడా మరణము సంభవించలేదుకదా? యని మహామేరువు విరిగిబడినట్లు ఝూంకారము చేయుచున్న సమయమునకే రాజకుమారులు చేరిరి. వారు బరిణెనుండి తెల్ల తుమ్మెదను తీసి చిదుగగొట్టగానే రాక్షసుని కరచరణములు విరిగి మహామేరువు కూలబడినట్లాతడు కూలబడెను. భూమి గడగడ వణకెను. నక్షత్రములు రాలినవి. దేవతలు భయపడి దేవేంద్రు నాశ్రయించిరి. దేవేంద్రుడు బృహస్పతి చెంతకు పోయి యీ ఘోరప్రళయ మేమన, బృహస్పతి యిట్ల నెను. దేవేంద్రా! భూలోకమున లోకకంటకుడగు బ్రహ్మరాక్ష

సుని నీ వెరుంగవా ? యనిన దేవేంద్రుడు, హా ! ఏమిటి ? వాడు మనలోకమునకే వచ్చుచున్నాడా ! మన లోకములోని ధనాగారములన్నియు మూసి మనము విష్ణుమూర్తి సన్నిధానమునకు పోవుదమని ఆతృతగా చెప్పుచుండ, బృహస్పతి నవ్వుతూ భయపడకుమని వారించి; ఆ రాక్షసుని నేడిరువురు రాకుమారులు సంహరింపుచున్నారని ధైర్యము చెప్పగా, దేవసమూహములు చుట్టును గొలువ దేవేంద్రుడు అంతర్వీధులలో నిలిచి, రాజకుమారులపై పూలవాన కురిపించెను. రాకుమారు లిరువురూ మిగిలిన రెండు తుమ్మెదలను భరిణెనుండి తీసి చెరియొకటి పట్టుకొని నలగగొట్టిరి. శోడనే రాక్షసుడు గిజగిజ గింజుకొని మరణించెను. వెంటనే రాక్షస హృదయమునుండి దేదీప్యమాన శరీరంతో ఒకగంధర్వుడు ప్రత్యక్షమై రాజకుమారులంజూచి అనఘులారా ! మీరు నా శాపవిమోచనము గావించితిరి. మీ మేలు మరువజాలను. మీకు నా వలన యేదేని వుపకారము కావలయునేని కోరుకొనుడన, రాజకుమారులు ఆ గంధర్వునితో యిట్లనిరి. మహాత్మా ! మీ రెవరు ? మీకీ ఘోర రాక్షసరూప మెట్లువచ్చెను. చెప్పుడనిన యా గంధర్వు డిట్లనియెను. నే నొక గంధర్వపతిని. వివేకహీనుడనై నొకసిద్ధు నవమానపరచితిని. ఆతడు నాపై గినిసి నీ వొక ఘోరరాక్షసుడవు గమ్మని శపించెను. మీ వలననే నా శాపవిమోచనమైనది. గాన నేను రాక్షసరూపములో నున్నప్పుడు సర్వరాజ్యములను జయించి గొనితెచ్చిన రత్నములు, మణులు, వజ్రవైడూర్య

ములు మీ యధీన మొనర్చితిని గొనుడని చెప్పి తాను గంధర్వ లోకమునకుం బోయెను. ఈ అద్భుత వింతను జూచుచున్న బ్రహ్మరాక్షసుని సేవకుడు జ్వాలాముఖుడు రాకుమారులవద్దకు పోయి వారి పాదములపైబడి, రక్షింపుడు! రక్షింపుడు! అని పాదములు పట్టుక విసువకుండెను. రాకుమారులు అభయ మివ్వగా, వాడు లేచి మెల్లన నిట్లనియెను. రాకుమారులారా! నేను బ్రహ్మరాక్షసుని సేవకుడను. యికనుండి మీ యధీనుడ నైతిని. నన్ను రక్షింపుడు. నేను సర్వమాయలు నెరుంగుదును. గాన మీరు కోరినప్పుడల్లా మీయెదుట ప్రత్యక్షమై మీరు కోరిన సహాయ మొనర్చెదననిన రాకుమారులు సంతసించుచూ ఆ క్షణమందే రాజహంససహా రాక్షసుని భుజముపై కూర్చొని యెగిరిపోవుచుండిరి. ఇలా వారందరూ సముద్రములు, నదులు, కొండలు, పర్వతములు దాటుతూ పోయి, ఒక అడవిలోనికి ప్రవేశించి సముద్రపుడొడ్డున దిగిరి. రాక్షసుడు వారివద్ద సెలవుపొంది అవసరపడినప్పుడు పిలవమని చెప్పి మాయమయ్యెను. అప్పుడు హంస యిట్లనెను. రాకుమారులారా! మన మీ సముద్రపుటొడ్డుననే ఒక గుడిసెను నిర్మించుకొని ఆనందముగా కొన్నాళ్ళు నివసించుదమనగానే వారందుల కంగీకరించి అట్లే యొనరించిరి. వారాసమీప గ్రామములోనికి పోతూ బ్రహ్మరాక్షసుడు వీరి కధీన మొనర్చిన వజ్రవైడూర్య ములనుండి వారికి కావలసిన సామగ్రులను ఒక్కొక్కదానిని యిచ్చుచూ ఎట్టి లోపము లేకుండా కాలము వెళ్ళబుచ్చుచుం

డిరి. ఆ నగరములోని వర్తకులంతా ఒకనాడు వీరిని గురించి రహస్యముగా ఆలోచించి వీరికీవజ్రాలు, రత్నాలు, ముత్యాలు యెచ్చట లభించుచున్నవి? వీరి వేషాన్నిబట్టి ధనవంతుల్లా అగుపడుట లేదే? వీరెట్టి చిన్నవస్తువు గొన్నప్పటికీ యింతవిలువైన వజ్రములను యిచ్చుచున్నారే. వీరు వీటిని దొంగిలించి తెస్తున్నారా యని అనేక విధముల ఆలోచనలను జరిపి వారిని పట్టి రాజున కప్పగించనెంచిరి. కాని వారిలో నొక వర్తకుడు యిట్లనెను. అందువలన మన కేమిలాభము? ఒక అణాసామాని స్తే మనకో మంచి విలువైన వజ్రము లభిస్తుంది. కొన్నాళ్ళకు మనమంతా గొప్ప ధనికులమగుదుము. వారిని రాజుగారి కప్పగిస్తే మన కేమి లభిస్తుంది. అని చెప్పగా వర్తకులంతా ఎవరిమటుకు వారు మంచిది మంచిదంటూ తమ తమ యిండ్లకరిగిరి. ఇక ఆ నగర రాజుగారి సంగతి తెలుసుకోవలసివుంది.



# నాల్గవ ప్రకరణము.

క. నారీ జనముల కాజ్ఞా
కారియగు భటుండు మరుండు గాబోలు జుమీ
వారి కటాక్షము సోకిన
వారి యెడన వాడి జూపి వర్తించుగదా। (భర్తృహరి)

ఆ నగరము పేరు చక్రపురి. ఆరాజుపేరు చక్రదత్తుడు. రాణీపేరు చంద్రవతి. వారికి పూలబంతియను ఒక చక్కని కూతురుంది. ఆమెను తూచిన ఒక పూబంతితో సమానంగా తూగును గనుకనే ఆమెకు పూలబంతియని పేరు వచ్చింది. ఒకనాడు విజయుడు యథాప్రకారము తనకు కావలసిన వంట సామాగ్రులను తీసుకొని పాదచారియై పురంబునంగల రాజ వీధినుండి వచ్చుచుండ, కోట కిటికీ వద్ద కూర్చుని యున్న పూలబంతి అతని రూపు రేఖా లక్షణంబులు జూచి, వివశయై విస్మయము గలిగినదియై నతని మొగమట్టె జూచుచుండెను. విజయుడు కోటసమీపాన కరుదెంచగనే పైనుండి గాజులసవ్వడి గలిగించినది. ఆ శబ్దమువిన్న విజయుడు తలపైకెత్తి చంద్రుని ముఖంబోలు పూలబంతినిజూచి, ఆమె రూపు విభ్రమ విలాసంబులరసి మోహ పరవశుండై రెప్పవాల్పక జూచుచు దన మనసున నిట్లని చింతించెను. "ఆహా! యీ చిన్నదాని రూపమెంత జగన్మోహ నాకారముగా నున్నది. నిష్కాముడనగు నాచిత్తమునే వికారము నొందింపు చున్నదే. ఓహో సౌందర్య

మునం దెట్టి శక్తి యున్నది. యిక్కన్య వైకుంఠమునుండి భూమిపై సంచరించుటకు మారు రూపముతో వచ్చియున్నదా? లేక తన శరీర స్వర్ణచ్ఛాయ పుంజమున నీ పర్వతప్రదేశమంతయు వెలిగించు చుండుటంజేసి సూర్యుని చూచివచ్చిన తదీయ కిరణములలో నొక్క కిరణమా? లేక నన్ను గృహ పూర్వ శీతల నిర్మలకాంతిచే మనుస్సును సంతోషింప జేయుటచే భూమికి విలాసార్థముగా వచ్చిన చంద్రరేఖయా? దీని సర్వావయవసౌష్టవము తీరు భూలోకమున పరవనితల కెవరికైనం గలదే? దేవ గంధర్వ యక్ష కిన్నర కాంతలందరి సౌందర్యముల నొకటిగా గూర్చి కమలభవుం డొనర్చెనేమో కదా! నేను పుట్టినది మొదలింతదనుక నిట్టి సుందరిని జూచి ఎరుంగనే? దీనిని జూచి నా నేత్రము లానందించి నా జన్మము ఫలవంతమొనర్చెను. ఈమెను జూచిన కన్నులతో వేరొద్దానిని జూడ నాకిచ్ఛ పుట్ట"దని యనేకవిధముల మనస్సునందాలోచించి ఆమెయందు చూపుల్కలు నిలిపి మన్మథుని పంచబాణములకు గురియై మనస్సున పొడమిన మోహమును నిలుపనేరక చింతాక్రాంతుడై అనేక విధముల తలపోయుచు తన గుడిసె కరిగెను.

విజయుడు పోగానే పూలబంతి మోహావేశముతో యితని నింకోసారి ఎట్లా దర్శించుకోగలనన్న భ్రాంతితో దినమంతా కూర్చొని ఆ దారివెంబడి వచ్చేపోయేవారి నందరినీ చూచుచుండెను. అతని నివాసమెక్కడో తెలిసియున్నచో వర్తమానమైనా పంపించియుందునే యని పలువిధముల చింతించెను.

అక్కడ విజయుడు కూడా అదేస్థితిలో వున్నాడు. అతడు తన గుడిసెకు చేరుకొని, "నిత్య క్రియాకలాపంబులం దీర్చుకొని, ఒకచో కూర్చుండి యిట్లు చింతించెను. ఆహా! ఆమె చూపులు లేడిచూపులవలె నున్నవే! ఆమె చూపులను తలంచుకొన్న నా హృదయమిప్పుడు వివశమగుచున్నది. మంచి సమయము మించబెట్టితినిగదా! మరికొంతసే పచ్చటనే నిలుచుండి ఆమె సౌందర్యమును చూసి ఆనందింపలేకపోతిని కదా! నావంటి వెంగలి ఎందైనాగలడే! ఆమె శృంగార విలోకములు నాయందనురాగము గలిగినట్లు తెలియజేయుచున్నవి. కాని మన్మ అదియే సత్యమైనచో కాము డుపకారము చేయక మానడని తలంచెదను. అతడు విరహబాధతో వ్యాకులతజెంది నాటినుండి రేయింబవళ్లు ఆమెను తలంచుకుంటూనే చింతించుచుండెను.

వీని పరిస్థితిని గమనించిన హంస ఒకనాడు యిట్లంది. రాజకుమారా! నీ విలా చింతించుటకు గతంబేమి? నీ యుద్దేశము తెలుపక నాపద్ద దాపరిక మెందులకు? నీ వెవరినో వరించియున్నట్లున్నావు? నేను నీ కోర్కెను తప్పక నెరవేర్చెదను. ఆనాడు నలదమయంతుల దాంపత్యం కుదిర్చింది మా జాతివారుకదా! నీ మనోవేద నేదో త్వరగా తెల్పుమన, విజయుడు సంశయించుచు యిటు నుడివెను. మరాళమా! నే నొకనాడు యీ నగరంలోనుండి వంటసామగ్రులను తీసుకొని వచ్చుచుండ కోట పైభాగమున ఒక నవయావనవతిని చూచినప్పటి

నుండి నా మనస్సామెపై లగ్నమైయున్నది. ఆమె సౌందర్యాతి శయ మిట్టిదని చెప్పుటకు నాకు కాదుకదా సృష్టించిన బ్రహ్మ దేవుని తరముకూడా కాదు. ఆ కోమలాంగిని చూచినప్పటి నుండి నా యవస్థ యిట్టిదని చెప్ప శక్యముగాకున్నది. ఆమెతో నే నెలాకలుసుకోగలనని విచారించుచుంటినని చెప్పెను. అప్పుడు రాజహంస యీమాత్రపుదానికేనా యింతగా విచారించుచుం టివి. మొదటనే నాకెందు కీసంగతిని చెప్పవైతివి. యిప్పటి కైనా మించిపోయిన దేమియును లేదు. ఇప్పుడు నీ పేరు, నీమనోద్దేశము వెల్లడించుచూ ఒక చీటీని వ్రాసి, ఆ కోటను నాకు చూపించుమనగానే విజయుడు హంస చెప్పినట్లుగా వ్రాసి హంసతో కలిసి నగరముచేరి కొంత దూరాన్నుండి ఆ కోటను చూపించెను. హంస రివ్వున ఎగిరి పూలబంతి నిల్చున్న కిటికీ యొద్ద ఆ వుత్తరాన్నుంచి కోటపైనుండి చూచుచుండెను. ఇంతలో పూలబంతి యథాప్రకారము కిటికీ వద్దకు వచ్చి అచ్చోట పడియున్న వుత్తరాన్ని తీసి ఆతృతగా విప్పి తనలో తానిలా చదువుకుంది — "ప్రాణేశ్వరీ! నిన్ను చూచిననాటి నుండి నా మనస్సు నీ యందే లగ్నమైయున్నది. నిద్రాహార ములు విసర్జించి యున్నాను. నీవు నన్ను పొందదలిచితివేని నేడే యీ నగరానికి తూర్పుదిశగానున్న సముద్రపుటొడ్డున నిర్మించి యున్న గుడసెవద్ద నన్ను కలుసుకొనుటకు ప్రయత్నించుము. లేకుంటే నేను ప్రాణత్యాగము చేసుకొనక తప్పదు." అనివ్రాసి యున్న వుత్తరాన్ని మరొక పర్యాయం చదువుకొని దానికి

సమాధాన మీ విధంగా వ్రాసింది. "ప్రాణేశ్వరా! నేను కూడ మిమ్ము చూచినప్పటినుండి మీవలెనే రేయింబవళ్లు కంటికి నిద్రలేక విచారించుచుంటిని. మీ నివాసమేదో తెలుసుకొన లేక నా యీ సందేశాన్ని మీకు పంపించలేక పోతిని. మరియు నేను మీరున్నచోటున కెట్లు రాగలను? మీరే అర్థరాత్రివేళ కోటవద్దకు వచ్చియుండండి. నే నంతకుముందే అక్కడ నొక త్రాటిని వ్రేలాడగట్టెదను. మీరు ఆ త్రాడు సహాయంతో పైకెగ బ్రాకి నన్ను కలుసుకొన గలరు." అని వ్రాసి అచ్చటనే వుంచెను. పైనుండి దీనినంతా గమనించుచున్న హంస వెంటనే ఆ వుత్తరాన్ని నోటగరచుకొని గుడిసెకు చేరుకొనెను. విజయుడా వుత్తరాన్ని చదివి హంసకు వినిపించగా హంస యిట్లనెను. రాజకుమారా! చెట్లకు పూవులు పూయునట్లే ప్రయత్నము వలననే శుభములు చేకూరునందురు. మన పని నెరవేరినట్లే కదా! యింక మన మిప్పుడొక పని చేయవలసి యున్నది. నీ విప్పుడే ఆ రాక్షసుని తలచుకొనుము. అని అన గానే విజయుడు రాక్షసుని తలచుకొనడమూ, వెంటనే రాక్షసుడు ప్రత్యక్షం కావడమూ జరిగినది. అప్పుడా హంస రాక్షసునితో, "ఓయీ! నీవు ప్రతిదినము అర్థరాత్రివేళ ఈ స్థలమునకు వచ్చి విజయుని నీ వీపుపై నెక్కించుకొని రాజ మహల్లోనికి తీసుకుపోయి, తిరిగి వేకువజాముననే తీసుకురావలయు"నని కోరగా రాక్షసు డట్లేయని వెళ్ళిపోయెను. విజయుడు అంతు లేని ఆనందంతో మరో వుత్తరాన్ని యీ విధంగా వ్రాసెను.

"ప్రాణసఖీ! నే నీనాడు అర్ధరాత్రి సమయమున తప్పక వచ్చె దను. నీవు త్రాడును కట్టనక్కర లేదు. గాని కిటికీవద్ద నా కొరకు వేచియుండ వలసిన"దని వ్రాసి హంసకిచ్చి పంపించెను. పూలబంతి ఆవుత్తరా న్నందుకొని, చదివి ఆనందించి అర్ధరాత్రి కాకమునుపే సింగారించుకొని వయ్యారంగా కిటికీవద్ద నిలుచుం డెను. విజయుడు సరిగా అర్ధరాత్రివేళ రాక్షసుని సహాయంతో కిటికీవద్దకు చేరుకొనెను.

పూలబంతి విజయుని చూచి సిగ్గు నభినయించుచూ విజయుని చేయి పట్టుకొని శయ్యామందిరమునకు తీసుకుపోయి పాన్పుపై పరుండపెట్టి ప్రేమసంభాషణములు సంభాషించి, తన వూరు పేరు మొదలగునవి అడుగగా విజయుడు చెప్పి, పూలబంతి చేయిపట్టుకొని తన చేతి వుంగరాన్ని తీసి ఆమె చేతికి తగిలించెను. అదే పాణిగ్రహణవిధియై, చేలములకు బ్రహ్మ ముడులు సంఘటించెను. అటుల ఆ నాతిచేతికి వుంగరాన్ని తగి లించి కౌగలించుకొనగ, పూలబంతి "రాజకుమారా! మీరీ ప్రాంతమును విడిచి ఎచ్చటికీ వెళ్ళవద్దు. మీకు కావలసిన వస్తు సామగ్రులను సమకూర్చుదును" అని చెప్పిన "నీ యనుగ్ర హామే కావలయును; అంతకంటె వేరొకటి లేద"ని పలుకు చున్నంతలోనే కోడి కూయజొచ్చింది. వెంటనే రాజకుమా రుడు కిటికీ వద్దకు వచ్చి నిలబడడమూ, రాక్షసుడు కూడా అప్పుడే రావడం జరిగింది. విజయుడు పూలబంతితో "యిక వెళ్ళివత్తు ననుజ్ఞ యిమ్మ"ని కోరగా, ఆమె మిక్కిలి చింతించి

కంట నీరు పెట్టుకున్నది. విజయుడు కూడా కంటినీరు కార్చెను. అతని కంటి నీటిబిందువులకు బదులు ముత్యాలు రాలుచుండుట చూచి పూలబంతి ఆశ్చర్యపడెను. విజయుడు రాక్షసుని భుజముపై నెక్కి తన నివాసమున కరిగెను. పూలబంతి ముత్యాల నన్నింటిని ఏరి ఒకచోట దాచియుంచి నిద్రపోయెను.

ఉదయాన్నే దాసీ పూలబంతిని చూచుటకు ఒక పూల చెండు పట్టుకొనివచ్చింది. పూలబంతి యింకను లేవనందున బయటనుండి పిలిచింది. లోపల నిద్రించుచున్న పూలబంతి విసుగుతో బరువెక్కిన శరీరంతో మేల్కొని తలనొప్పిగా నున్నదని చెప్పుచున్ననూ దాసీ ఆమెకు స్నానంచేయించి యథాప్రకారం చూచినది. ప్రతీదినముకంటె ఆ రోజున పూలబంతి ఎక్కువ బరువైంది. యిదిగమనించిన దాసీ ఆశ్చర్యంతో నోరు నొక్కుకొని యీ వార్తను రాజువద్దకు పంపించెను. యిదివిన్న చంద్రదత్తుడు కోపముతో ఎవరో తన కుమార్తెతో సంబంధము గలిగియున్నట్లు గ్రహించి, అట్టివానిని పట్టియిచ్చినవారికి తన రాజ్యములో సగభాగమిత్తునని దర్బారులోని వారందరికీ విన్నవించెను. మహారాజాగారి ఆజ్ఞప్రకారం దర్బారులోని దాసదాసీ జనములంతా రాకుమారి గృహములోనికి ప్రవేశించుచు వానిని పట్టుకొనుటకై నిశ్చయించుకొని జాగ్రత్తగా పహరా నిచ్చుచుండిరి.



## ఐదవ ప్రకరణము.

---

మ. రసవాదంబులు పెక్కు నేర్చినను తా రాజేంద్రుడై యేలినన్
అసదృశ్యమంత్రము లుచ్చరించినను విద్యాప్రౌఢిమం గల్గినన్
అసహాయంబున శూరుడై గెలిచిన న్నంభోనిధిన్ దాటినన్
నొసటన్ వ్రాసిన వ్రాలుతప్ప కలదా నూతేండ్లు చింతించినన్.

దర్బారులో నెంతమంది కాపలాయున్నను విజయుడు మాత్రము రాక్షసుని సహాయంతో ప్రతిదినము కిటికీగుండా లోనికి ప్రవేసించి, పూలబంతితో యిష్టాగోష్టి సల్పుచు పోవుచునే యుండెను. అందుచేత పూలబంతిని తూయడానికి చాలినన్ని పూవులుగూడా దొరకజాలనంతటి బరువయ్యెను. దర్బారులోనివారంతా దొంగ చిట్టునిపట్టుకొన జాలనందుకు మిక్కిలి చింతించుచుండిరి. దర్బారులోని వాడెవడో యింతటి ఆఘాయిత్యమున కొడిగట్టుకొని యున్నాడని తలంచి, యింటి దొంగను యీశ్వరుడైనా పట్టలేడన్న నిశ్చయంపై అందరును యథాప్రకారము కాలము వెళ్లబుచ్చుచుండిరి.

ఒకనాటి రాత్రి విజయుడు మోహావివశుండై పూలబంతిని బిగ్గరగా కౌగలించుకొని యధరామృతముగ్రోలి యిరువురి మనంబులంగల యభిలాషందీర స్మరపార వశ్యంబున సముబాహ్యాంతర విశేషంబుల గ్రీడించి, యలసి, సొలసి గాఢనిద్రావశంవదులగుటయు నంతలో మేల్కొని చూచునప్పటికి తెల్ల

వారెను. వేకువజాముననే రాక్షసుడు కిటికీ వద్దకువచ్చి విజయు డింకను రాకుండమిచేవగచి అతని కేదైనా వుపద్రవము జరిగి యుండనోపునని తలంచి, వెంటనే హంస నొద్దకువెళ్లి యీసం గతిని వినిపించి అదృశ్యుడయ్యెను. తక్షణమె హంస రాజ మహల్లోకిపోయి ఏమి జరుగునాయని కదంబవృక్షముపై కూర్చుని యుండెను. విజయుడు మేల్కొని చూచునప్పటికి సూర్యోదయ మగుటచే భయముతో గడగడ వణకుచూ పూలబంతితో యిట్లనెను. "ప్రాణసఖీ! యిప్పుడేమి చేయుదును. యిప్పుడెట్లు తప్పించుకొని పోగలను?" అనిన పూలబంతి యిట్ల నియె. "రాకుమారా! నీవు చింతింప పనిలేదు. నీ ప్రాణానికి అడ్డంగా నాప్రాణాన్ని అడ్డెదను." యీ మాటలన్నియు రాకు మారిని మేల్కొలుపటానికై వచ్చియున్న దాసీ విని వెంటనే యీవార్తను దర్బారునకు పంపించినది. రాజభటులు పరుగెత్తుక వచ్చి విజయుణ్ణి బంధించి రాజునొద్దకు గొనితెచ్చిరి. కదంబ వృక్షముపై నున్న హంస దీనినంతను చూచి తమగుడిసెవద్దకు పోయి విక్రమునకీ వార్త నందించెను. తన అన్న ఆపదలో చిక్కుకున్నందుకు విక్రముడు మిగుల దుఃఖించెనుగాని హంస ధైర్యముగా వానితో యిట్లంది. రాకుమారా! భయపడకుము. పూర్వజన్మంబు నాటి సుకృత, దుష్కృతరూపమగు బీజము వృక్షమై ఫలించును. దానిఫలములనే జనుండు భక్షింపుచుం డును. అట్టి పూర్వ కృతమును మార్చుటకు బ్రహ్మదేవుని కైనను శక్యముకాదు. ఎక్కడనెవ్వని కెంతెంత యనుభవింప

వలసియుండునో దైవము వారినక్కడకు తీసుకొనిపోయి అనుభ వింపచేయును. అట్టిదానివిషయమై చింతింపనేల? మరి యాభగ వంతుడేమి చేసినను మేలునకే చేయును గాన యింతటినుండి మీ కష్టాలు గట్టెక్కినవనుకొమ్మని చెప్పినది.

అక్కడ రాజు విజయుణ్ణి చూచి కోపోద్దీపమానుండై శిరచ్ఛేదము చేయించవలసినదిగా ఆజ్ఞాపించెను. రాజాజ్ఞప్రకా రము కసాయివాళ్లు విజయుని యీడ్చుకొని పోవుచుండ పూల బంతి కత్తిని ఝళిపించుకొని ఎదురేగి విజయుని వారి చేతుల నుండి విదలించి రాజునొద్దకువచ్చి వానికంటె ముందు తనకే శిరచ్ఛేదము చేయించవలసినదని కోరినది. అందులకు రాజు మిక్కిలి వగచి యిట్లనెను. కుమారీ! నీవెందు కీతనికొరకు ప్రాణత్యాగము చేయబూనుకొంటివి. నిన్నొక చక్కని మాన మర్యాదలుగల రాజకుమారునికిచ్చి వివాహమొనర్చెదను. నీవీ తనపైనున్న మనస్సును మార్చుకొనవలసినదని చెప్పగా పూల బంతి యిట్లనెను. తండ్రీ! నే నీతనితప్ప అన్యులను పెండ్లాడదల చుకోలేదు. నే నీతనినే మనసారా ప్రేమించాను. నా అదృష్ట మెట్లున్నదో అట్లే జరిగితీరుతుంది. మీరిద్దానిని అంగీకరింప నిష్టపడితే మంచిదే. లేదా నేనీక్షణమందే మీ యెదుటనే నా ప్రాణాన్నర్పించెదనని తన మొలనున్న బాకునుదీసి, పొడుచు కొన బోవునంతలో రాజు ఆమె చేయిపట్టుకొని ఆ బాకును తీసుకొని పరిపరివిధాల ఆలోచించి కుమార్తెపై వాత్సల్యంగల వాడై ఆమె మాటను అంగీకరించి, విజయుణ్ణి సంకెళ్ళనుండి

విడిపించి, అతనిని తనప్రక్క నొక గద్దెపై కూర్చుండబెట్టి ప్రేమతో భుజమును తట్టి, స్థితిగతుల నడిగి తెలుసుకొని పరమానంద భరితుడయ్యెను. తన తమ్ముడగు విక్రముడు హంసతో సముద్రపుటొడ్డున గుడిసెలో యున్నట్లు చెప్పినందున రాజు వారిని తోడ్కొని వచ్చుటకై యిరువురు భటులను పంపించెను. తక్షణమే వారు పోయి విజయుని, హంసను తోడ్కొని వచ్చిరి. రాజు విక్రముని కౌగలించుకొని అతనిని మరో ఆసనంపై కూర్చుండబెట్టి గౌరవించెను. ఆనాడే రాజు పెండ్లిసన్నాహములు జరిగించవలసినదిగా ఆజ్ఞాపించెను. యింతలో మంత్రి రాజునొద్దకు వచ్చి తన కుమార్తె స్వర్ణలతకు చిన్నరాకుమారుడు విక్రమునితో వివాహం జరిపింపవలసినదనియు, తాము దుల కంగీకరింపవలసినదనియు కోరెను. అందరును ఆనందించిరి. ఒక సుముహూర్తమున విజయునికి రాకుమార్తె పూలబంతితోను, విక్రమునికి మంత్రికుమార్తె స్వర్ణలతతోను మహావైభవోపేతంగా వివాహం జరిగింది.

వివాహం జరిగిన కొలదిదినములకే చక్రదత్తుడు తన రాజ్య సర్వస్వాన్ని తన అల్లుడు విజయుని కప్పగించి నిశ్చింతతో కాలం వెళ్ళబుచ్చుచుండెను. విజయ, విక్రములు తమ తమ భార్యలతో సమస్తభోగము లనుభవించుచు దినాల్ని వెళ్ళబుచ్చుచుండిరి. యిక మణిపురాన్నియేలు న్యాయసింహుని గతి ఏమయిందో చదవండి.

న్యాయసింహమహారాజు పుత్రశోకముచేత దుఃఖించుచు

దృష్టి మాంద్యము గలిగినట్లు ముందే చదివియున్నారు. రాణీ రూపవతికి కూడా ఎంతకాలానికి సంతానప్రాప్తి కలుగకుండు టచే తన మనస్సునందు యిట్లు చింతించసాగెను. "ముందు వెనుకలాలోచించక సవతిబిడ్డలను చంపించితినే? మేము చని పోవునప్పుడు దహనక్రియలు జరిగించటానికైనా దిక్కులేనివార మైతిమి. మరణానంతర మీరాజ్యాన్నెవరు పాలించెదరు? నా వంటి పాపిష్టురాలీ లోకమునందు యింకెవతెయైనా వుండునా? మా జీవితశేష మెలాగడుస్తుంది? అని పరిపరివిధాల చింతించి పిచ్చెత్తినట్లయింది.

విజయ, విక్రములు ఆనందంతో ఎట్టి చింతా, చీకూ లేకుండా కాలం గడుపుచుండగా ఒకనాడు హంస వారితో యిట్లంది. రాకుమారులారా! మీతండ్రి మీపై విచారంవల్ల చావుబ్రతుకుల్లో నున్నాడు. మీరిప్పుడతన్ని దర్శించి, వారి నుల్లాసపరచటం మీధర్మమైయున్నది. అని యింకేమేమో చెప్పగా రాకుమారు లిరువురునూ తమ మామగార్ల వద్ద సెలవు పొంది త్వరలో తిరిగి వస్తామని చెప్పి తమతమ భార్యలతో కలిసి హంసతో బాటు రాక్షసమాయచే నిర్మింపబడిన రథముపై నెక్కి బయలుదేరి వాయువేగమనోవేగంబున మణిపురంబును చేరు కొనిరి.

వారు మణిపురమును ప్రవేశించినంతనే పురజనులంద రును శత్రురాజులెవరో తమరాజ్యముపై దండెత్తినారని భయ పడి రాజునొద్దకు వార్తనంపిరి. యీవార్తను విన్న న్యాయ సింహ మహారాజుకూడా బెంగపెట్టుకొనెను. వెంటనే విజయుడు

రథముదిగి ప్రజల నందరికీ చేయెత్తి నమస్కరించి "మీరెవరును భయపడకండి. మేమీ దేశపు రాజకుమారులమైన విజయ, విక్రములము." అనగానే పురజనులంతా అత్యాశ్చర్యానికి లోనై యీ వార్తను తిరిగి రాజున కెరిగింప మృతుండగువాడు జీవించిన చందంబున తెప్పరిల్లి ఏరీ! ఏరీ! నాకుమారులేరీ! ఎట్లు వచ్చిరి? అని తడువుకొనుచు రాబోవుచుండ విజయ, విక్రములు తల్లిదండ్రులం జేరి సాష్టాంగముగా ప్రణమిల్లిరి.

తన కుమారులిరువురు పునర్జీవితులైరని కనుల నానంద బాష్పములు దొరల, వెంటనే రాజకుమారులను కౌగలించుకొనెను. పురజనులంతా వారిని జూచి మిక్కిలి ఆనందించిరి. అంత విజయ, విక్రములిరువురును తాము పురమును వీడినది మొదలు ఆనాటివరకు జరిగిన వృత్తాంతమెల్ల పూసగ్రుచ్చినట్లు తెలిపి దైవమాయ నెవ్వరూ నతిక్రమింపజాలరని సిద్ధాంతపరచి యెల్లరకు నానందంబు గలుగజేసిరి. రాజు వారు వినిపించిన సంగతులన్నియు విని ఒకవంక తమ కుమారుల కెట్టి దురవస్థ కలిగించితినా యని విచారమును, వేరొకవంక తమ కుమారులిరువురును సుఖముగా తనను కలుసుకున్నందుకు సంతోషమును కలుగ వారి గుణసంపత్తి నభినందించెను. మరియు మంత్రి బుద్ధికుశలతచేతనే తన కుమారులు బ్రతికియుండిరని తెలిసి అతని నెన్నోవిధముల కొనియాడెను. రాణీ రూపవతి సవతిబిడ్డలను కౌగలించుకొని "కుమారులారా! నా మూలముననే కదా మీరిట్టి యిడుమలపాలైతిరి. నా వంటి పాపాత్ము

రాలికి తగిన శిక్ష మీరే విధించండి.' అని చెప్పగా విజయుడు సవతి తల్లిని యోదార్చి, "తల్లీ ! ఇందు మీ తప్పేమియును లేదు. ఇది మా పూర్వజన్మ కర్మమునకు ఫలము. చేసిన కర్మ మనుభవింపక తీరునా ? తొలి జన్మంబున జేసిన పుణ్యంబువలన యా కర్మఫలవిశేష మెడతెగక వర్తించుచుండగా సుందరభవనములును, సుందరారామములును, సమస్త దేశపరిపాలనంబును మొదలగునవి యనుభవింపబడును. అట్టి పుణ్యకర్మము తీరిపోవునేని వెంటనే యిదివరకుండిన భోగభాగ్యంబులన్నియు మన్మథ కేళియందు దారము తెగి నలుగడలు చెదిరిన ముత్యములవలె నశించునని పెద్దలు నుడివినట్లు మా కర్మఫల విశేషముననే అనుభవించితిమి" యనగ, తమ కుమారుల జ్ఞానబోధకు న్యాయసింహుడు మిక్కిలి ఆనందించెను.

ఆ మరునాడే మంత్రిని పిలిచి తన రాజ్యభారాన్ని విజయుని కప్పగించమని చెప్పెను. గాని విజయుడు తనకింతకు ముందే ఒకచోట రాజ్యము లభించెననియు, యీ రాజ్యాన్ని తమ్ముడు విక్రముని కప్పగించిన తా నానందించెదనని చెప్పగా రాజు యతని యౌదార్యమును కొనియాడుతూ వెంటనే మణిపురమును పురజనుల యెదుట విక్రమున కప్పగించెను.

తరువాత వారు రాక్షసుని కోరుకొని వానిసహాయంతో తనతండ్రికి నేత్రదృష్టి సరిగా కలుగునట్లు బాగుచేయించి, ఒక్క క్షణంలో తిరిగి వచ్చెదమని ఆ రాక్షసునిపై నెక్కి యెక్కడికో బోయిరి. అడవులు, కొండలు, పట్టణాలు క్రిందనుండి మహా

వేగంగా పరుగెత్తుచున్నట్లు వారి కగుపడుచున్నై. ఇలా వెళ్తూ వెళ్తూ ఒక నదిగట్టున విడిచిపెట్టబడిన రాణీ విద్యావతి శవము దగ్గరకు చేరుకొనిరి. అప్పటివరకా శవము అక్కడే పడివుంది. ఆ శవముపై విక్రముడు తన చిటికెనవ్రేలినుండి రక్తము చిమ్మెను. వెంటనే విద్యావతి దీర్ఘనిద్రనుండి లేచునట్లు మేల్కొని విజయుని చూచి హా! ప్రాణనాథా! యని అతని పాదాలపై వ్రాలింది. అప్పుడు విజయు డిట్లు చింతించెను. ఆహా! దైవ మొక యైంద్రజాలికుండై జనులను తోలుబొమ్మల వలె నాడించును. అది యెఱుంగక మానవులు స్వప్రయోజన కారులై సుఖదుఃఖముల నొందుచుందురు. ఊపిరిని విడుచుట కైనా వారికి స్వతంత్రత లేదు. సర్వము దైవాధీనమేకదా అని మనంబునం దలంచుకొని విద్యావతితో కలిసి రాక్షసునిపై నెక్కి కుమారి విద్యావతి తండ్రిగారి పట్టణమును చేరుకొని రాజు, రాణీలకు తమ కుమార్తె విద్యావతిని చూపించి వారిని ఆనందింపజేసి, అచ్చోట ఒకదినముమాత్రమే యుండి రాజు, రాజు సైన్యము వెంటరాగా తమ నిజరాజ్యానికి చేరుకొనిరి.

పాఠకులారా! ఎవరు పురాకృతకర్మ మనుభవించవలసి యుండునో వారు నీటియందు జొచ్చినను, మేరుపర్వత మెక్కినను, రణంబున వైరిపీకుల గెలిచినను, సమస్తకళల నెరింగినను కర్మవశంబగుటవలన రాబోవునది యైతీరును. ఎవ్వారు పురాకృత పుణ్యముగలవారో వారికి సింహ శార్దూలాది భీకర వన్యమృగ ములతో గూడిన యరణ్యమొక మహాసౌందర్యమగు పట్టణము

గాను, శత్రువులందరు మిత్రులుగాను నగుదురు. ఎందువలన బ్రహ్మ సర్వప్రపంచమందు కుమ్మరివాడు కుండలు చేయు రీతిని జీవరాసులను సృజించుచున్నాడో, శ్రీమహావిష్ణువు ఎందుకు దశావతారములెత్తి పెనుకష్టములకు లోనయ్యెనో, శివుడు ఎందుచేత మనిషి పుర్రెను పాత్రగా జేసుకొని భిక్షమెత్తుకొనుచుండెనో, సూర్యుడు దేనిచే యొకనిమిషమైనను నిలువక గగన వీధులం దిరుగుచుండెనో, మీరు గ్రహించినారా? యిదంతా కర్మమువలననేగాని వేరొండు కాదు. ఇక కథకు వద్దాం.

నాటినుండి విజయుడు చక్రపురమును ఏలుచూ పూలబంతి, విద్యావతి యిరువురు భార్యలతో సమస్తభోగము లనుభవించుచూ ప్రజలను రామరాజ్యమువలె పాలించుచుండెను.

విక్రముడు మణిపురమును ధర్మంబున నేలుచూ మంత్రి కుమార్తె స్వర్ణలతతో కాపురముచేయుచూ మిక్కిలి చాకచక్యముగానూ, ఆనందముగానూ సుఖంబనుభవించుచూ ప్రజలకెట్టి లోపములు కలుగనీయకుండా మహావైభవముగా పాలించుచుండెను. న్యాయసింహమహారాజు తన భార్య రూపవతితో నిశ్చింతగా తన కుమారుల రాజ్యపాలనంబును పరిశీలించుచూ తానెరింగిన ధర్మముల బోధిస్తూ, వారలను తప్పుమార్గముల బోనీకుండా కనిపెట్టి సమస్తభోగము లనుభవించుచుండెను.



సమాప్తం

# శుభవార్త!



స్వస్తిశ్రీ చాంద్రమాన నందన నామ సం॥ర
కార్తీక బహుళ పాడ్యమీ ఆదివారం కృత్తికా
నక్షత్రయుక్త చతుర్థ పాదమందు
(అనగా ది 2–11–52 ఆదివారం రాత్రి
గం. 1-20 నిమిషములకు)
ఈ గ్రంథ రచయితకు ప్రప్రథమమున
సుపుత్రికా జననము కలిగెనని యిందుమూలముగా
తమందరకు తెలియజేయుచున్నారము.



# రాష్ట్రేతరాంధ్రజ్యోతి సాహితీసమితి, టిటాఘర్.

యీ సమితి ఆధ్వర్యాన ద్వితీయ కుసుమముగా శ్రీ ఎల్లేటి క్రిష్ణారావుగారి "నరుడు - నారి" యను గ్రంధము అచ్చులో మన్నది. 80 పేజీలు; వెల 0—8—0 మాత్రమే.



త్వరలో తృతీయ కుసుమముగా శ్రీ తోటా విశ్వనాధం గారి గ్రంధ మొకటి వెలువడ నున్నది.

మీకేపుస్తకములు కావలసినను ముందుగా ఆర్డరుతో సొమ్ము కూడ పంపగోరు చున్నాము.

☞ ఏజంట్లు 25% కమీషను మినహాయించుకొని మరియు కాపీలకు సొమ్ము M. O. చేయవలెను.

---

ప్రతులకు :


**Thota Viswanadham,**

**Young Friends News Agency,**

*Anderson Road,*

P. O:- TITAGARH.

